3. 3. 1995 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి : 67, సంచిక : 9, వెలప్రతి : రు. 2.00లు. Phone : 27354 Regd No. HNL 18

# జమీన్ రైతు

వ్యవస్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు. జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి.



### మురికి కంపు కొడుతున్న నెల్లూరు మునిసిపల్ రాజకీయాలు

# మాయ చేయబోతే మాడు పగిలింది!

## మారుగొంతుతో మాగుంట దాసుడే డిసిసి అధ్యక్షునికి ఆదేశాలు జారీ చేశాడా?

నెల్లూరు మునిసిపల్ రాజకీయం మునిసిపాలిటీ మురుగు కాలువ కంపు కంటే హీనమైన దుర్వాసన వెదజల్లుతూంది; జలదారు గుంట కంటే జలదరింపు కల్గించేంతగా అదుపు తప్పిపోయింది. రాజకీయ మంటేనే కుళ్లు, కుత్సితాల మయం; కుట్రలు, కుతంత్రాల నిలయం. కాని వాటిని కూడా ఎంత అధః పాతాళానికి దిగిపోయి, అగాధానికి కృంగిపోయి నడిపించ వచ్చునో నెల్లూరు పౌరులకు అనుభవ పూర్వకంగా తెలియ జేశారు నాయకులు. ఈ విషయంలో కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు రెండూ "దొందూ దొందు" గానే వుండటం గమనార్హం.

కాంగ్రెస్‌కు సంబంధించి జిల్లా టిక్కెట్టుకు కూడా ప్రయత్నించలేదు. ఏ పదవీ లేకుండానే ఐరవయ్యేళ్ల నుంచి రాజకీయాలలో యాక్టివ్‌గానే వుండటం, వుండగల్గడం వివేకా ప్రత్యేకత. ఎప్పుడూ ఏదో ఒక అడ్డంకి. 1981

**కోరి తెచ్చుకున్న పరాభవం- కొంపముంచిన మంకుతనం**

లో రిజర్వుడైంది; 1987 లో ఎన్టి రామారావు ఎగనామం పెట్టాడు. ఇన్ని సంవత్సరాల సుదీర్ఘ నిరీక్షణ తర్వాత ఇప్పుడు అవకాశం లభించింది. కాంగ్రెస్ ఇప్పుడున్న పరిస్థితులలో, ఇంతటి ప్రతికూల వాతావరణంలో ధైర్యంగా ముందుకు వచ్చినవాడు వివేకా ఒక్కడే.

ముందుగా తమ వ్యాపారాల ప్రధాన నిర్వాహకుడు శ్రీ పివి ప్రసన్నరెడ్డిని ముందుకు నెట్టాడు. ఈలోగా మునిసిపాలిటీలకు టిక్కెట్లు లేవన్న పిసిసి నిర్ణయం రావడంతో రెండురోజులు సైగ్గా వుండి పోయాడు మళ్లా ఏ ఆలోచన కల్గిందో తమ తరఫున చెన్నారెడ్డి పెంచలురెడ్డి, పత్రి రవీంద్రబాబు, సి. ప్రవీణ్‌కుమార్ రెడ్డిల చేత నామినేషన్లు వేయించారు. ఇంతలో టిక్కెట్లిస్తామని పిసిసి మళ్లీ ప్రకటించడంతో ఆఖరు నిముషాన తిరిగి ప్రసన్నరెడ్డి చేత నామినేషన్ వేయించాడు.

ఇవన్నీ స్వతంత్ర నిర్ణయాలే తప్ప, ఒక్క కాంగ్రెస్ వాదితో సంప్రదించ లేదు. కనీసం తమ వర్గంలోని జెకెరెడ్డి, కెవి సుబ్బారెడ్డి వంటి వారితోనూ

జనార్దనరెడ్డిగారు, ఆనం సోదరులిద్దరిని మాగుంట సుబ్బరామిరెడ్డిగారి ఇంటికి

వస్తున్నట్లు ప్రకటించారు. అంతటితో జనార్దనరెడ్డి ఓర్పు హరించింది అయన

27 తేది మునిసిపల్ కమీషనర్‌కు ఛైర్మన్ గిరికి నామినేషన్ సమర్పిస్తున్న కాంగ్రెస్ అభ్యర్థి ఆనం వివేకానంద రెడ్డి



# ఆనం సోదరులు సహాయం అడిగి లేదన్పించుకున్నారు!

మాట్లాడలేదు. కాంగ్రెస్‌లో అందరూ కలిసి పోవాలని, ఎవరితో రాజీ పడడానికైనా తాను సిద్ధమని పదే పదే ప్రకటనలు చేసిన సుబ్బరామిరెడ్డిగారు హఠాత్తుగా తన ధోరణి మార్చుకొని

వెళ్లి, సహాయం అడగమని సూచించారు. నిన్నటి వరకు శత్రు శిబిరంగా వుండిన ఇంటికి తమంతట తాముగా వెళ్లి అభ్యర్థన విన్పించారు.

అయితే విచిత్రంగా సుబ్బరామిరెడ్డిగారు ఈ అభ్యర్థనలన్నీ పెడచెవిన పెట్టి, ఆనం వారు తమ ఇంటికి వచ్చినా విస్మరించి తమ అభ్యర్థిగా పివి ప్రసన్నరెడ్డిని నిలబెడుతున్నట్లు, టిక్కెట్ తమకే

పిసిసి అధ్యక్షుడితోను, ఢిల్లీ పెద్దలతోను మాట్లాడి వివేకానందరెడ్డికి టిక్కెట్ ఖాయం చేసేశారు; పత్రికల వారికి చెప్పారు. ఈ దశలోనైనా సుబ్బరామిరెడ్డి గారు సర్దుబాటు వైఖరి ప్రదర్శించి వుంటే బాగుండేది. కాని అట్లా జరగలేదు. టిక్కెట్ తమకెట్లా రాదో చూస్తానని శపథం బూని హైదరాబాదుకు, ఢిల్లీకి పరుగెత్తారు. కానీ అక్కడెక్కడా ఆయన మాటకు

(గం 11 పేజీలో)

# జనార్దన కవచం ముతాకత్తి పోట్ల నుంచి కాపాడింది!

రాజకీయ మంతా నెల్లూరు మునిసిపాలిటీ చుట్టూ గిరికీలు కొడుతున్నది. జిల్లాలో మరే చోటా కాంగ్రెస్ గెల్చే అవకాశం కన్పించక పోవడం, నెల్లూరు టౌన్‌లోనే ఆశ మినుకు మినుకు మంటుండడంతో అందరూ ఇక్కడే తిష్ట వేసి గబ్బు పెట్టిస్తున్నారు. పరిస్థితులు అనుకూలించిన తీరును బట్టి మునిసిపల్ రాజకీయం ఆనం వివేకానంద రెడ్డి ఒక్కడికి పరిమితమై వుండాలి. వివేకా ఈ పదవి కోసం చాలా కాలం నుంచి ఎదురు చూస్తుండిన వాడు. అతని కార్యకలాపాల పరిధి నెల్లూరుకు పరిమితం. అంతకు మించిన ఆశలు, ఆలోచనలు లేవు. కనీసం ఎమ్మెల్యే

తక్కిన వారందరూ ఆఖరు నిమిషం వరకు మీనమేషాలు లెక్క పెట్టారు; వెనుకాముందు వూగిసలాడారు. దీనికి తోడు మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి మొదటి నుంచి వివేకా పేరే ప్రతిపాదించారు. రెండవ ఆలోచనే చేయలేదు. ఈ పరిస్థితులలో ఛైర్మన్ అభ్యర్థిత్వం వివాదాస్పదం కాకుండా నిర్ణయమై వుండాలి.

కానీ మాగుంట సుబ్బరామిరెడ్డి గారు ఇక్కడా అసెంబ్లీ ఎన్నికలలో వలెనే వ్యవహరించారు. పార్టీలో తన వ్యక్తిగత పలుకుబడి, పెత్తనం రుజువు చేయడానికి ఛైర్మన్ అభ్యర్థి ఎంపికను సావకాశంగా వాడుకోజూశాడాయన.

తిరిగి పాత ఒంటెద్దు పోకడ ఎందుకనుసరించారో అర్థమే కాదు. అప్పటికే ఆనం సోదరులు మనసు చంపుకొని ఉభయ మిత్రులైన ఇద్దరు వ్యాపారుల ద్వారా పివి ప్రసన్నరెడ్డిని కలిసి సహాయం అభ్యర్థించారు. అనాటికి ప్రసన్నకు పోటీ ఆలోచన లేదు. రహస్యంగా జరిగిన ఈ సమావేశం, గంట తిరిగేలోగా బట్టబయలైపోయింది. దీన్ని సర్దుబాటుకు వాడుకోవడానికి బదులు ఆనం వారికి, జనార్దనరెడ్డికి మధ్య విబేధాలు సృష్టించేందుకు విస్తృత ప్రచారం కల్పించారు. అయితే కాంగ్రెస్ గెలిస్తే చాలు, తగువులెట్లావుంటె ఏమి అనే విశాల మనస్తత్వంతో

# జపనీయులకు వలవేస్తున్న సిమెంట్ కంపెనీలు

# మాగుంట పరిశ్రమల పార్క్ సురక్షితమైనవి!

మాగుంట సోదరుల ప్రతిష్ఠాత్మక ప్రాజెక్ట్ 'మద్రాసు ఇండస్ట్రియల్ పార్క్' దక్షిణ భారత పారిశ్రామిక రంగంలోనే సంచలనం సృష్టిస్తున్నది. సింగపూర్ కారిడార్ అని కూడా పిలువబడే ఈ ఇండస్ట్రియల్ పార్క్‌లో తమ పరిశ్రమలు స్థాపించడానికి జపనీయులను ఒప్పించేందుకు పెద్ద ప్రయత్నం జరుగుతున్నది. జపాన్ దేశస్తులను ఇక్కడకు ఆకర్షించ గల్గితే ప్రపంచంలోని ప్రతి పారిశ్రామిక సంస్థ దీనిపై ఆసక్తి చూపుతుందని భావన. జపనీయులకు భారతదేశంలో పరిశ్రమలు స్థాపించాలన్న ఆలోచన చాలా కాలం నుంచి వుంది. కాని వారికి అవసరమైన సాంఘిక, ఆర్థిక పరిస్థితులు ఇక్కడ లేకపోవడంతో పెద్ద పెద్ద కంపెనీ ఎగ్జిక్యూటివ్‌లు ఇండియాకు రావడానికి ఆసక్తి చూపడంలేదు. తమ జీవన స్థితిగతులకు తగిన నివాస భవనాలు ఇక్కడ లేవని వారి సందేహం. భాష పెద్ద సమస్య. అందువల్ల వారు ఇతరులతో కలిసి మెలసి తిరగలేరు. వారి ఆహార అలవాట్లు ప్రత్యేకమైనవి. ఆ తిండి ఇక్కడ దొరకదు. వీటన్నింటి వల్లా జపనీయులు ఆర్థిక సరళీకృత విధానాల పట్ల ఆకర్షితులైనప్పటికీ, ఉత్సాహంగా ముందుకు రాలేకున్నారు.

> ఆరు వేల కోట్ల పెట్టుబడిని ఆశిస్తున్నారు; ఒక మినీ నగరమే నిర్మిస్తున్నారు!

ఈ పరిస్థితిని తమకనుకూలంగా మల్చుకోవడానికి మాగుంట సోదరులు ప్రయత్నిస్తున్నారు. తమ పరిశ్రమల పార్క్‌కు అనుబంధంగా వారు 1200 ఎకరాల సువిశాల స్థలంలో ఒక మినీ నగరం నిర్మించ బోతున్నారు. ఈ టౌన్‌షిప్‌లో ఉన్నతాధికారులు, పెద్ద పెద్ద పారిశ్రామిక సంస్థల అధినేతలు నివసించేందుకు అనువుగా ఇళ్లు కడతారు. సోషల్ క్లబ్‌లు, వినోద క్రీడా స్థలాలు ఏర్పాటు చేస్తారు. అంతర్జాతీయ ప్రమాణాలలో రోడ్లు వేస్తారు. ఒక గోల్ఫ్ మైదానం నిర్మిస్తారు. ఈ టౌన్‌షిప్‌కు నిరంతరాయంగా కరెంట్ సరఫరా చేసేందుకు 200 మెగావాట్ల విద్యుత్ కర్మాగారం నెలకొల్పుతారు. జపనీయులు, ఇతర పాశ్చాత్యుల ఆహార అలవాట్లకు అనుగుణమైన రెస్టారెంట్లు నడుపుతారు. ఇందుకోసం జయలలితను ఒప్పించి 1200 ఎకరాల స్థలం ఇప్పటికే సంపాదించారు. ఇదికాక, నీటి అవసరాలు తీర్చను, బోట్ షికారుకోసం ఒక పెద్ద సరస్సు నిర్మింపబడుతుంది.

ఈ ఏర్పాట్లన్నీ పూర్తయితే కనీసం 6వేల కోట్ల రూపాయల పెట్టుబడితో ఇక్కడ పరిశ్రమలు నెలకొనే అవకాశం వుందని అంచనా. ఇందులో విదేశీయులే కాక, స్వదేశీ సంస్థలు సైతం పరిశ్రమలు స్థాపించుకోవచ్చు. మొదట దీనిని ఎగుమతి ప్రాసెసింగ్ జోన్‌గా నిర్వహించాలనుకున్నారు. కాని ఇప్పుడు అన్ని రకాల పరిశ్రమలనూ ఆహ్వానిస్తున్నారు.




ఈ సింగపూర్ కారిడార్ ప్రాజెక్టులో మాగుంటవారికి 20 శాతం వాటా వుంది. మరొక 20శాతం స్పిక్ కంపెనీ అధినేత శ్రీ ఎ సి ముత్తయ్య స్వీకరించారు. కంపెనీకి ఆయనే ఛైర్మన్. మలేషియాకు చెందిన హికమ్ బెరహర్ద్ అనే పెద్ద సంస్థ ఇందులో 40శాతం వాటా కోసం ప్రయత్నిస్తున్నది.

ఈ సంవత్సరం సిమెంట్ కంపెనీలకు మంచి భవిష్యత్ వుంది. ఈ కంపెనీలకు రాజకీయ అస్థిరత్వంతో సంబంధం లేదు. అందువల్ల వాటి షేర్ల ధరలు పెద్దగా తగ్గడం లేదు. బొంబాయిలో ఇప్పుడు సిమెంట్ బస్తా ధర రు.160ల వరకు వుంది. ఆంధ్రలో రాబోయే మూడు నెలల్లో కరెంట్ కోత వల్ల సిమెంట్ ఉత్పత్తి తగ్గుతుంది. దీనివల్ల ధరలు పెరిగి షేర్లు లాభిస్తాయి.

### చెట్టినాడ్ సిమెంట్

దీని గురించి రెండు వారాల క్రితమే వివరంగా చర్చించాము. పెట్టుబడికి ఎటువంటి నష్టం రాదు. కనీస లాభానికి అనుమానం లేదు.

### రాశి సిమెంట్

ఈ షేరు ధర రు.133 లు వుంది. సౌత్ ఇండియాలో ఈ కంపెనీ గురించి తెలియని వారుండరు. ఇది మామూలు పోర్ట్‌ల్యాండ్ సిమెంట్‌ని తయారుచేస్తుంది. మొన్న సెప్టెంబరు మాసాంతానికి మంచి అభివృద్ధి చూపించింది. లాభాలు ఏడున్నర కోట్ల నుంచి 15కోట్ల 50 లక్షలకు పెరిగాయి. ఇపిఎస్ రు. 19.80లు వుంది. చాలా మంచి ఇపిఎస్ ఇది. పిఇ రేషియో 7; ఇది చాలా తక్కువ. ఇపిఎస్ ఎక్కువై పిఇ రేషియో తక్కువైనందు వల్ల ఈ షేరు ధర జూన్ నాటికి 180నుంచి 200 రూపాయల వరకు పెరుగుతుంది. పెట్టుబడికి నష్టం వుండదు.

### శ్రీ సిమెంట్

దీని ధర ఇప్పుడు రు. 66లు; సెప్టెంబరు మాసంలో మంచి ఫలితాలు చూపించింది.86 కోట్ల అమ్మకాలతో, 9కోట్ల 60లక్షల లాభం వచ్చింది. ఇపిఎస్ 7:8; పిఇ రేషియో 8 రెట్లు. జూన్ నాటికి ఎంత లేదన్నా రు.900 వరకు పెరుగుతుంది.

# షేర్ల ధరల పెరుగుదల నికరమైనది కాదు!

షేర్ మార్కెట్‌లో పాక్షిక ఫార్వర్డ్ ట్రేడింగ్‌ను ప్రవేశ పెట్టడానికి పరిశీలన జరుపుతున్నారు. దీనినే బదలా విధానం అంటారు. బొంబాయి షేర్ మార్కెట్‌లో ఈరోజు ప్రధాన సమస్య లిక్విడిటీ. రెండు నెలలకు పైగా సెటిల్‌మెంట్‌లు జరగనందువల్ల డబ్బు చేతికి రాదు. కొంత మంది బ్రోకర్లు పెద్ద కంపెనీల షేర్లను కొని రెండు మూడు వారాలు ధరలు పెంచి, ఒక సెటిల్‌మెంట్ నుంచి మరొక సెటిల్ మెంటుకు వ్యాపార లావాదేవీలు పొడిగించుకుంటూ పోతూ వుంటారు. వీళ్లే మళ్లీ షేర్ల ధరలను కూల్చి తమ సెటిల్‌మెంట్‌ను పూర్తి చేసుకొని లాభాలు ఆర్జిస్తారు. ఇటువంటి వారికి బదలా విధానం చాలా అవసరం. అయితే నగదు పెట్టి షేర్లు కొని తిరిగి లాభాలతో అమ్ముకోవాలనుకొనేవారికి పెద్ద దెబ్బ ఈ విధానం.

గతవారం రోజులుగా ఎ గ్రూప్ షేర్ల ధరలు పెరగడానికి కారణం స్పెక్యులేషన్, షార్ట్ కవరింగ్‌లే! ఇది నిజమైన, నికరమైన పెరుగుదల కాదు. పెద్దగా లావాదేవీలు జరగలేదు. అయినా ఇండెక్స్ ఒక్క రోజే 130 పాయింట్లు పెరిగింది. మామూలు పెట్టుబడి దారులు బిగ్రూప్ షేర్లలోనే లావాదేవీలు అధికంగా జరుపుతారు. ఈ ఇండెక్స్ పెరుగుదల వీరికి పెద్దగా వుపయోగ పడదు.

ఫార్వర్డ్ ట్రేడింగ్ మీద సెబి ఛైర్మన్ మెహతా నియమించిన కమిటీ నివేదిక ఈ వారంలో వస్తుంది. ఆ

(రెండవ 7 పేజీలో)



## నిర్యాణము

దయామయురాలు, స్నేహశీలి, ఉదార స్వభావియైన

**శ్రీమతి బండేపల్లి లక్ష్మి, M.A. B.Ed**

(కాళహస్తి లక్ష్మి), టీచరు, వి.ఆర్. హైస్కూలు
W/o. శ్రీ బి. రామమోహన్ గారు
Second D/o. శ్రీ కాళహస్తి రామనాథం గారు

24.2.95 తేదిన హైదరాబాదులో స్వర్గస్థురాలైనారని తెలుపుటకు చింతిస్తున్నాము. ఆ దివ్యమూర్తి స్మృతికి ఇవే మా నమస్సుమాంజలులు. కర్మ క్రతువులు హైదరాబాదులో మార్చి 5, 6, 7, 8 తేదిలలో జరుగును.

బంధువులు

Local Address: L.I.G. 1- 48, A.P.H.B. Colony, Behind Nippo, NELLORE

# బీహార్ రాజహింస

బీహార్ శాసనసభ ఎన్నికలను వారం నుంచి పది రోజుల వరకు వాయిదా వేసి ఆ రాష్ట్రంలోని అరాచక పరిస్థితులను లోకానికి తేటతెల్లం చేశారు ఛీఫ్ ఎన్నికల కమీషనర్ టిఎన్ శేషన్.

బీహార్‌లో ఎన్నికలను సక్రమంగా, శాంతి యుతంగా నిర్వహించ గల్గితేనే తాను చేపట్టిన ఎన్నికల సంస్కరణ ప్రక్రియ ఫలించినట్లు భావిస్తానని శేషన్ మొదటి నుంచి చెప్తుండినారు. ఆయన లక్ష్యం నెరవేరేందుకు వీలుగానే బీహార్‌లో అసెంబ్లీ గడువు ఆయన పదవీ కాలంలోనే ముగింపుకు వచ్చింది. మూడు నెలల నుంచి ఆ రాష్ట్రాన్ని, ఆ రాష్ట్రంలోని అధికారులను, నాయకులను అదుపులో పెట్టడానికి శేషన్ పడ్తున్న తాపత్రయం అంతింత కాదు. కానీ వారిని లొంగ దీయడం రాక్షసుడి వంటి శేషన్‌కూ అలవి కావడం లేదు.

బీహార్‌లో ఎన్నికలంటే గూండాలు, రౌడీల విశృంఖల వీర విహారమే. ప్రజలు పోలింగ్ బూత్‌కు వెళ్లి స్వచ్ఛందంగా ఓటు వేసే ప్రాంతాలు ఆ రాష్ట్రంలోనే పది పదిహేను శాతానికి మించవు. తక్కిన చోట్లల్లా బూతుల ఆక్రమణలు, రిగ్గింగ్‌లు, దౌర్జన్యాలు సర్వసాధారణం. అధికారులు, పోలీసులు అధికారంలో వుండే వారి అడుగులకు మడుగు లొత్తుతూ వారు చేసే సకల నబ్బందు దుర్మార్గాలకూ వత్తాసు పలుకు తుంటారు. అందులోనూ ముఖ్యమంత్రి లల్లూప్రసాద్ యాదవ్ ఈ దౌర్జన్య వైఖరికి ప్రతిరూపం. ఆయన నేతృత్వంలోని ప్రభుత్వం ఎన్నికలు నిర్వహిస్తే అవి ఎంత సుందర ముదనష్టంగా వుంటాయో వూహించు కోవచ్చు.

ఎన్నికల ప్రచారంలో కమీషన్ నియమ నిబంధనలకు లాలూ యాదవ్ చిల్లి గవ్వ విలువ ఇవ్వలేదు. ఎన్నికల ప్రకటన వెలువడిన తర్వాత కూడా ఆయన యదేచ్ఛగా పోలీసు అధికారులను బదలీ చేస్తున్నారు. పోటీలో వున్న ప్రత్యర్థి అభ్యర్థులను వెంటాడి వేధిస్తున్నారు. హత్యలు, దౌర్జన్యాలు సర్వసాధారణంగా జరిగి పోతున్నాయి. ఎన్నికలు శాంతి యుతంగా నిర్వహించడం మా వల్ల కాదని పలువురు కలెక్టర్లు చేతులెత్తేశారు. ఐజి స్థాయి అధికారి ఒకరు రాజకీయ వాది వలె లాలూ చెప్పుచేతుల్లో వుండి వ్యవహరిస్తున్నాడని సహ పోలీసు అధికారులే బహిరంగంగా ఫిర్యాదు చేశారు. ఎన్నికల ఖర్చు నిబంధనను ఎవరూ పట్టించు కోలేదు. అడిగిన కలెక్టర్లకు బెదరింపులు వస్తున్నాయి. తుపాకిలతో పబ్లిక్‌గా తిరగడం మామూలుగానే జరిగి పోతున్నది.

ఈ దుర్మార్గాన్ని అదుపు చేయడానికి శేషన్ చేసిన ప్రతి ప్రయత్నాన్నీ ముఖ్యమంత్రి నిరోధించారు. 45 వేల మంది సెంట్రల్ పోలీసులను పంపితే వారికి జీపులు, పెట్రోలు ఇవ్వకుండా వున్న చోటనే వుండి పోయే పరిస్థితి కల్పించారు. విసిగి పోయిన శేషన్‌కు పోలింగ్ వాయిదా తప్ప గత్యంతరం లేకపోయింది. సుప్రీం కోర్టు కూడా శేషన్ నిర్ణయాన్ని సమర్థించడం ఇక్కడ గమనార్హం.



ఇప్పుడు దాదాపు లక్ష మంది పోలీసులతో వారికి అవసరమైన రవాణా వసతులను కేంద్ర హోం శాఖ కల్పించే ఆదేశంతో ఎన్నికల భద్రత వ్యవహారాన్ని తాను స్వయంగా పర్యవేక్షిస్తున్నారు శేషన్. ఆయన పట్టుదల ఫలించి, బీహార్ ఎన్నికలు శాంతియుతంగా జరిగిపోతే అంతకంటే సంతోషించాల్సిన విషయం వేరొకటి లేదు.

దేశంలో ఎక్కడే మూల ఏ చిన్న సంఘటన జరిగినా ప్రజాస్వామ్యం హరించుకొని పోతున్నదని పెడబొబ్బలు పెట్టె జనతాదళ్ నాయకులు తమ పార్టీ ప్రభుత్వం నడిపే రాష్ట్రంలో ప్రజాస్వామ్యానికి ఇంత ఘోర హాని జరుగుతుంటె మారు పలకడం లేదు. ప్రజాస్వామ్య సూత్రాలను సదా జపించే వామ పక్షాలు సైతం లల్లూ యాదవ్ కొంగు వెనుక చేరి భజన చేస్తున్నాయి. తమకు పదవులు లభిస్తాయంటె ప్రజాస్వామ్య విలువలు ఏమైపోయినా వీరికి అవసరం లేదా?

ఎన్నికల వ్యవస్థను అధికార దుర్వినియోగ చెదలుతో శిథిలం కాకుండా సజీవంగా వుంచడానికి శేషన్ చేస్తున్న సాహసోపేత మతానికి ప్రతి భారతీయుడు నైతిక మద్దతు నందించాలి.



2-3-45

పేజీలు : 4 వెల : 0-1-6

### ఆంధ్ర దేశమంతటా అంటు వ్యాధులు

ఫిబ్రవరి 3-10 తేదుల మధ్య మన రాష్ట్రంలో 147 గురుకు కలరా తగిలింది. 85 గురు మరణించారు. 2191 మందికి స్ఫోటకం పోసి 460 మంది మరణించారు. 144 గురుకు ప్లేగు పొడసూపింది. అందు 93 గురు మరణించారు. పశ్చిమ గోదావరి, కృష్ణా, నెల్లూరు జిల్లాలలో కలరా; విశాఖ, గుంటూరు నెల్లూరు జిల్లాలలో స్ఫోటకం; చిత్తూరు, అనంతపూర్ జిల్లాలలో ప్లేగు వ్యాధులున్నాయ్.

మొత్తంమీద ప్రతి జిల్లాలోనూ ఏదో ఒక అంటు వ్యాధి బయలుదేరింది. ప్రజారోగ్యం విషయమై ప్రభుత్వం తగినంత శ్రద్ధ వహిస్తున్నట్లు లేదు. ప్రభుత్వం చురుకుగా ప్రజారోగ్యరక్షణకు పూను కోవాలి లేకుంటె రాష్ట్రమంతటా విపరీతంగా వ్యాధులు వ్యాపించి ఉత్తర బీహార్ స్ఫురణకు తెచ్చునని హెచ్చరించు తున్నాం.

### నెల్లూరు జిల్లా బస్ సర్వీస్ ఏమిటి అన్యాయం?

ఆండాల్ బస్ సర్వీస్ ఓనరు, డ్రైవరు, కండక్టరు చెడిపోయిన ఒక బస్సు విషయమై జిల్లా సూపరింటెండెంట్ వారికి సంజాయిషీ వ్రాసుకోగా యింతలో కండక్టరు సెలవుమీద పోగా డ్రైవరు జీతం ఫిబ్రవరి 6తేదికి సెటల్‌జేసి అతనిని యింటికి వెళ్లమనడంలో ఏమైనా న్యాయమున్నదా? ఓనరుకు ఎవరిచ్చారు యీ దుస్సలహా? బస్సుసర్వీసు ఎసెన్షియల్ సర్వీసస్ ఆర్డినెన్సు క్రిందకి వస్తుందని తగిన కారణంలేక, చిత్తం వచ్చినట్లు వర్కర్లకు విశ్రాంతి యిస్తే శిక్షకు పాత్రులౌతారని తెలుసుననుకుంటాం.

యోగ్యుడైన మేనేజరుగల యీ సర్వీసులోనే యిట్లావుంటె రంగనాధా మహాప్రభో; యిక వర్కర్లకు దిక్కెవ్వరు?

నెల్లూరులో మంచి డి.వై.యస్‌పి కితోడు మంచి డి.యస్.పి రావడం సంతోషించ తగిన విషయం; తన సంజాయిషీని గమనించి డి.యస్.పి.

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

న్యాయం కలుగు జేస్తారని డ్రైవరు గంపెడాశతో వున్నాడు.

ఓనర్ల కష్టాలునన్నూరు. మాకు తెలుసుకాని పేదలమైన మా వర్కర్లనోటికాడి కూడుపోతె మేము సహించలేము.

* * *

### నెల్లూరు ముచ్చట్లు

రంగడితిరనాళ్ల మహాజోరుగా సాగింది. వ్యవసాయ సంత మాత్రం

కొరవ 10 పేజీలో

# సారా వాసన కొట్టే నాయకులను దూరంగా వుంచే హామీ ఏమైంది?

సారాయి వాసన వుండే వాళ్లను దగ్గరకు రానీయనన్నారు ఎన్టీరామారావు. అధికారంలోకి రాక మునుపు. అధికారంలోకి వచ్చాక ఆమాట మరచి పోయారు. జిల్లాలో పేరుగాంచిన సారా కాంట్రాక్టర్ రావుల అంకయ్యగౌడ్‌ను తెలుగుదేశం పార్టీలో చేర్చుకొన్నట్లు ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి చెప్పారు. గౌడ్‌కి ఏ పార్టీలోనైనా చేరే స్వాతంత్ర్యముంది. కాని నీతి లేనిదల్లా తెలుగుదేశం పార్టీలోని వారికే. రాపూరులో అంకయ్యగౌడ్ అసెంబ్లీ ఎన్నికల్లో ఎదురు నిలిచినా ఎల్లసిరి ఎమ్మెల్యే కాలేదా? ఏదో ప్రయోజనాలు ఆశించిన స్థానిక నాయకుల మాటను అధినాయకుడు కూడా ఆమోద ముద్ర వేసినట్లున్నారు.

నెల్లూరు. -త్వరకవి.

### ఎస్. వి. కృష్ణారెడ్డికి బహిరంగలేఖ!

వీడియో క్యాసెట్ వ్యాపారంలో పేరుగాంచిన "మనీషా" అధినేత ఎస్. వి. కృష్ణారెడ్డి కొబ్బరి బొండాం చిత్రానికి తొలుత సంగీత దర్శకత్వం వహించారు. తర్వాత ఆయన ఏ దర్శకుడూ సాధించ లేనంత వేగంగా హిట్‌మీద హిట్ చిత్రాలు తీసి సక్సెస్ దర్శకుడయ్యారు. ఆయన తీసిన 'యమలీల' చిత్రం 175 రోజులు ఆడింది. ఇటీవల ఈ చిత్రాన్ని మనీషా సంస్థ వారే వీడియో క్యాసెట్ ఇటీవల విడుదల చేశారు. 175 రోజులు ఆడిన ఆ సినిమా టి.వి.లో చూడను ప్రేక్షకులు తలపట్టు కోవాలి. చిత్రంతోపాటు 111 వ్యాపార ప్రకటనలు సినిమాకు జతచేశారు. చిత్రం నిడివి కన్నా ఇదే ఎక్కువ. అవి చాలవన్నట్లు సినిమా నడిచే సమయంలో తెరపై వచ్చే ప్రకటనలు పాత్రధారుల సగం శరీరాలను మింగేశాయి. వీడియో చిత్రంలో ప్రకటనలు వుండడంలో తప్పులేదు. మరీ అన్ని పెట్టడమే బాధాకరం. విజయవంతమైన చిత్రం, అంటె రూపాయికి రూపాయి బయ్యర్లకు సాధించి పెట్టిన చిత్రంలో అన్ని వ్యాపార ప్రకటనలు జోడించాల్సిన అవసరం ఏమిటి? మనీషా వీడియో రంగం నుండి సినిమా రంగంలో నిలదొక్కుకుంది.

## జనవాణి

కాబట్టి మనీషా చిత్రాల్లోనైనా ప్రకటనల జోరు తగ్గించాలని ఎస్.వి. కృష్ణారెడ్డిని కోరుతున్నాను.

హైదరాబాదు. -ఎం. నరసింహారావు.

### ప్రభుత్వానికి సూచన!

రాష్ట్ర ప్రభుత్వం వుద్యోగుల సంక్షేమానికి అమలు చేస్తున్న భీమా పథకం సిబ్బంది కొరత కారణంగా కోట్ల రూపాయల ప్రీమియం రాబడిని కోల్పోతుంది. ఇది వుద్యోగులందరికి నిర్బంధ పథకమయినా రాష్ట్రమంతటికి నాలుగు ప్రాంతీయ కార్యాలయాలు మాత్రమే వున్నాయి. ఇక్కడ పని చేస్తున్న 320మంది సిబ్బంది మెరుగైన సేవలు అందించ లేకున్నారు. పాలసీలు సకాలంలో అందవు. ఋణాల మంజూరు, క్లెయిమ్‌ల పరిష్కారం, బోనసు ప్రకటనలో తీవ్ర జాప్యం జరుగుతోంది. నిర్వహణ దయనీయంగా వున్నా ఏటా వందకోట్ల రూపాయల ప్రీమియం రాష్ట్ర ఖజానాకు చేరుతోంది. ఇందులో నిర్వహణ కోసం ప్రభుత్వానికి ఖర్చయ్యేది పదికోట్ల రూపాయలు మాత్రమే. ప్రభుత్వం భీమా పథకానికి సిబ్బందిని పెంచి, సేవలు మెరుగుపరచి వుద్యోగులందరిచేత భీమా చేయించగలిగితే ఖజానాకు ఆదాయం

(కొరవ 8 పేజీలో)



పౌరాణిక నాటక రంగంలో విశిష్ట సేవకు [illegible] బలాది వీరేశలింగం అవార్డును హైదరాబాదు రవీంద్రభారతిలో విద్యామంత్రి ముద్దుకృష్ణమనాయుడు చేతుల మీదుగా స్వీకరిస్తున్న మన పొన్నాల రామసుబ్బారెడ్డి.

# గ్రంథసమీక్ష

## వెయ్యేళ్ళ తెలుగు పద్యానికి పట్టిన అద్దం!

సహస్ర వసంతాల సాహితీ వారసత్వంగా పద్యశిల్పాన్ని చిత్రించిన వారు నండూరి రామకృష్ణమాచార్య గారు.

' గుడి కూలును - నుయి పూడును వడి నీళ్లకు చెరువు తెగును, వనమును

> **పద్యశిల్పం**
> రచయిత
> **నండూరి కృష్ణమాచార్య**
> సమీక్షకుడు
> **సురభి నరశింహం**
> ప్రతులకు
> 1-8-76, ప్రెండర్ ఘాస్ట్ రోడ్.
> 35, జవహర్ నగర్.
> సికిందరాబార్ - 500 003.
> **వెల రూ.80/-**

ఖిలమౌ, చెడనిది పద్యం బొకటియె కుదియెదమల కీర్తిగన్నగువ్వలచెన్నా'- అనే కవి సూక్తిని ఆధారం చేసుకొని వెయ్యేండ్లలో తెలుగులో అవతరించిన కావ్యాలలోని పద్యాల. శిల్ప సౌష్ఠవాన్ని గూర్చి రచించ బడిన గ్రంథమిది. ' తెలుగు తల్లి కడుపు చలువ పంటలు సుమ్ము వచన గేయ పద్య రచనలెల్ల' అని రచనలు తెలుగు తల్లి కడుపు పంట అని చెప్పారు. ఏ భాషకూ లేని ఛందోబద్ధమైన కవిత్వం తెలుగు భాషను వరించి, ప్రత్యేక మణి భూషణంగా వెలసింది. కవిత అంటె ఛందస్సు మాత్రమే కాదు. పద్య శిల్ప సౌష్ఠవ రేఖలు ఎన్నో వున్నాయి. ఏ విషయానికి ఏ పద్యం రచించాలి అనే శిల్ప రహస్యాన్ని పూర్వ కవులు గుర్తించారు. విద్వత్కవులైన రామకృష్ణమాచార్యులు నన్నయ నాటినుండి నేటి తరం వరకు పద్య రచన ఎట్లా సాగింది అనే అంశాన్ని సోదాహరణంగా యిందులో పొందు పరిచారు.

చరలయందు సూర్యచంద్రులుండెడిదాక
ఉర్విమీద కొండలుండు వరకు
జగతి వరలుగాక శబ్దార్థ సంక్రాంతి

(10వ పేజీలో)

తెలుగుదేశానికి జనార్ధనరెడ్డి హెచ్చరిక

# "హింస మానకుంటే త్రిప్పికొట్టాల్సి వస్తుంది"

జిల్లాలో తెలుగుదేశం నాయకులు హింసా రాజకీయాలకు స్వస్తి పలకకపోతే తాము కూడా హింసను - హింసతోనే ఎదుర్కొంటామని మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి హెచ్చరించారు. 26 తేది నెల్లూరులో విలేకరుల సమావేశంలో మాట్లాడుతూ దక్కిలి మండలం తెలుగు దేశం పార్టీ హింసా రాజకీయాలకు నిలయమైందన్నారు. అక్కడి పార్టీ నాయకులు దామెర్ల నారాయణరావు, నన్నావుల పెదనరసయ్య నాయుడు, దండోలు రమణారెడ్డి, జడ్పిటిసికి పోటీ చేస్తున్న కాంగ్రెస్ అభ్యర్థి రత్నయ్య ఇంటికి వెళ్లి అభ్యర్థిత్వాన్ని ఉపసంహరించుకోక పోతే పసుపు, కుంకుమలు నిలవవని రత్నయ్య భార్య బెదరించినట్లు చెప్పారు. రత్నయ్య హత్య విషయంలో పోలీసులు తగిన చర్యలు తీసుకోకుంటె కుటుంబ సభ్యు.. నిరాహార దీక్ష కూర్చుంటారని దానికి తామంతా మద్దతిస్తామని చెప్పారు. రత్నయ్య హత్య మూడో మండలంలో సంఘటనని ఈ విధానాన్ని దేశం నాయకులు విడనాడాలని కోరారాయన

### ఎదురులేని కవులు- తిరుపతి వెంకటకవులు!

"ఏనుగు నెక్కి రాజేంద్రులు మ్రొక్కుతుండగా వూరేగితిమి, గొప్ప బహుమానములు, సన్మానములు పొందితిమి. సంస్కృతాంధ్ర బాషలకు మేము కవీంద్రులమని రోసమున మీసము పెంచితిమి. మమ్ములను ఎవ్వరేని ఓడించిన మీసము గొరిగించు కొనెదము" అని మీసం తిప్పి సవాలు చేసిన కవులు తిరుపతి వెంకట కవులని విద్వాన్ లింగరాజా చెప్పారు. కళాసుధ దొడ్ల పద్మావతమ్మ మహిళా గ్రంథాలయంలో 27 తేది ఏర్పాటు చేసిన చెళ్ళపిళ్ళ వెంకటకవి 45 వ వర్ధంతి సభలో మాట్లాడారాయన. వారు వ్రాసిన శ్రీకృష్ణ రాయబారం నాటకంలోని 'చెల్లియో చెల్లకో', 'జెండాపై కపిరాజు' పద్యాలు ఆంధ్ర దేశంలో ఈనాటికీ మారు మ్రోగుతున్నట్లు చెప్పారు. గ్రంథాలయ సంస్థ కార్యదర్శి రమాపతిరాజు మాట్లాడుతూ సంస్కృత బాష పై చేయిగా వున్న కాలంలో శ్రీ శాస్త్రి, తెలుగు సాహిత్యాన్ని ప్రబంధాలు, నాటకాలు, అవధానాల ద్వారా చాటి చెప్పారు. వారికి కర్పూర నీరాజనం అర్పించారు. కళాసుధ అధ్యక్షురాలు శ్రీమతి శైలజారెడ్డి స్వాగత వచనాలు పలకగా కార్యదర్శి వైద్యుల శ్రీనివాసరావు వందన సమర్పణ గావించారు.





తిరుపతి వెంకట కవుల వర్ధంతి సభలో విద్వాన్ లింగరాజును సత్కరిస్తున్న వైద్యుల శ్రీనివాస రావు. ప్రక్కన కళాసంస్థల పోషకుడు పెంచలసింగ్

### శ్రీ రామకృష్ణ నాట్యమండలి నాటక పంచకం!

శ్రీ రామకృష్ణ నాట్య మండలి 16 తేది నుండి 20 తేది వరకు టౌన్‌హాల్‌లో నాటక పంచకాన్ని నిర్వహిస్తుంది. పౌరాణిక నాటకాన్ని బ్రతికించే కృషిలో బాగంగా సంస్థ ఈ కార్యక్రమం చేపడుతున్నట్లు ప్రముఖ నటుడు పొన్నాల రామసుబ్బారెడ్డి చెప్పారు. 16 తేది భక్త రామదాసు. 17 తేది పాదుకా పట్టాభి షేకం. 18 తేది చిత్ర నళీయం. 19 తేది విషాద సారంగ

(11వ పేజీలో)

విద్వాన్ లింగరాజా, కావలి జవహర్ భారతి కళాశాల లెక్చరర్ కె. నాగరాజును కళాసుధ తరపున కొండా బలరామిరెడ్డి సత్కరించారు. పల్లిపాడు డైట్ కాలేజి లెక్చరర్ గుడి నారాయణ బాబు చెళపిళ

# నెల్లూరు టౌన్‌లో నిచోళుల కోట ఎట్లా మాయమైంది?

> **నెల్లూరు జిల్లా ప్రాచీన చరిత్రకు నూతన వ్యాఖ్యానం!**
> కొల్లూరి సాయిభక్త కేశవ
> సాంకేతిక సహాయకుడు, పురావస్తుశాఖ, నెల్లూరు

(గత వారం కొరవ)

కొంత కాలానికి చోళ సామ్రాజ్యానికి పునాదులు వేసిన మొదటి పరాంతక చోళుడు క్రీ.శ. 907 - 953 నాటికి మిగిలిన పల్లవుల ప్రాభవాన్ని అస్తమింప జేసి కంచి నుండి నెల్లూరు వరకు ఆక్రమించారు. చోళులకు సామంతులుగా 12 వ శతాబ్ది ప్రథమార్థం నుండి కంచి నుండి నెల్లూరు మండలం వరకు గల దేశాన్ని తెలుగు చోళులు పాలించ సాగారు. వీరిలో నల్లసిద్ధి 12వ శతాబ్ది ప్రథమార్థంలో నెల్లూరు, కడప, చెంగల్పట్టు జిల్లాలతో కూడిన రాజ్యాన్ని కంచి. విక్రమ సింహ పురమనే నెల్లూరు, మారు రాజధానులుగా పాలన చేశారు. అప్పటి నుండి నెల్లూరు తెలుగు చోళ రాజ్యానికి రాజధానిగా వ్యవహరించటం మొదలైంది. తెలుగు చోళుల శాసనాలలో నెల్లూరు "జయగొండ చోళ మండలంలోని వెదికుల మాణిక్య పల నాటి యందలి పడైనాటి విక్రమ సింహపురమను నెల్లూరు" అని పేర్కొన బడింది. చోళరాజు, మూడో కులోత్తుంగుని (క్రీ.శ. 1178 - 1226) శాసనంలో నెల్లూరు "పల్లింటి, లేక పలై విక్రమ సింహ పురి" అని పేర్కొన్నాడు. ఈ విధంగా శాసనాలలో నెల్లూరు, విక్రమ సింహ పురం అను పేర్లతో అనేక మార్లు పేర్కొన బడింది.

నెల్లూరు పట్టణంలో తెలుగు చోళ రాజుల కాలం నాటి కోట ఎక్కడ వుండి వుంటుంది? ఇక్కడ కోట ఉదయగిరి, చంద్రగిరి కోటల లాగా నిలిచి ఉండక పోవటానికి కారణాలు ఏమిటి? అనేవి సందేహాలు.

బోయరాజుల కాలం నుండి ఇక్కడ కోట నిర్మాణం జరిగి వుంటుందనేది నిర్వివాదాంశమైన విషయం. అయితే మనకు ఆ కాలపు కోటకు సంబంధించిన ఆధారాలు కనిపించటం లేదు. తెలుగు చోళ రాజుల కాలంలో నిర్మితమైన కోట మూలాపేట, బారకాసు, కోటమిట్ట ప్రాంతాలలో ఉండి వుంటుందని పెద్దల అభిప్రాయం. ఈ ప్రాంతాలలో ఇప్పటికీ అనేక బొంత రాతి పలకలు, గ్రానైట్ బండలు అక్కడక్కడా కనిపిస్తూనే ఉన్నాయి. ఉదయగిరి, చంద్రగిరి కోటలలాగా ఇది చిరస్థాయిగా ఉండక పోవటానికి కారణం ఇది 'గిరి దుర్గం' కాక పోవటమే. కేవలం స్థల దుర్గం అవటం వల్ల ప్రజలు తమ భవన నిర్మాణాలకు అవసరమైన రాళ్లను వీటి నుండి తీసుకుని వాడుకున్నారు. కోట పట్టణం మధ్యలో ఉండటం వల్ల స్థలం ఆక్రమణ జరిగినప్పుడు కూడా ఇది ఎక్కువగా పాడు చేయబడింది. మిగిలిన దాని అవశేషాలు ఎక్కడో భూమిలో నిక్షిప్తమై ఉన్నాయి. మూలాపేటలోని మునిసిపల్ బాలికల పాఠశాల ఆవరణలో భవన నిర్మాణం కొరకు పునాదులు త్రవ్వేటప్పుడు 2.5 మీటర్ల లోతులో లభ్యమైన అవశేషాలు సేకరించి పరిశీలించడం జరిగింది. ఇచ్చట 12, 13 శతాబ్దాలకు చెందిన మట్టి పైపులు, గ్రానైటు బండలు, మృణ్మయ పాత్రల శకలాలు కనుగొన్నారు. సిఎఎమ్ హై స్కూల్ ఆవరణలో కూడా ఇటువంటి అవశేషాలే కనిపించాయి. కలెక్టరు ఆఫీసు ఆవరణ దగ్గర నుండి ములామూడి బస్టాండ్ మధ్యలో అనేక ప్రదేశాలలో 12, 13 శతాబ్దాలకు చెందిన బొంత రాతి కట్టడాలు కనుగొన్నారు. ముస్లిం నవాబులు నిర్మించిన కోట అవశేషాలు బారకాసులో చేపల మార్కెట్, జిల్లా పరిషత్ కార్యాలయం సమీపంలో ఇప్పటికీ మనకు కనిపిస్తూనే వున్నాయి.

నెల్లూరు ఒక పట్టణంగా క్రీ. పూ. 3వ శతాబ్దంలో రూపు దిద్దుకొని ఉండవచ్చునని పురావస్తు అధికారుల మూలంగా చెప్పవచ్చు. ప్రాచీన చారిత్రక కాలం నాటి పాటి దిబ్బను వేదాయపాళెంలో కనుగొన్నారు. పెన్నానది ఒడ్డున బృహత్ శిలాయుగపు సమాధులున్నాయి. ఈ సమాధుల నిర్మాతలు నెల్లూరు పట్టణ నడిబొడ్డున ఎక్కడో ఒక చోట ఉండి ఉండవచ్చు. పట్టణమంతా క్రిక్కిరిసిన భవన సముదాయంతో నిండి ఉండటం వల్ల మనకు శాస్త్రీయ పరిశోధనలు జరిపే

(10వ పేజీలో)

జిల్లావార్తలు

# చందనం స్మగ్లర్లకు దేశం నాయకుల అండ?

రాపూరు ఎర్ర చందనం స్మగ్లర్లు మళ్లీ విజృంభించారు. గత మూడు నెలలుగా చలి కాలం అయినందువల్ల సత్తె నడకగా సాగుతుండిన స్మగ్లింగ్ ప్రస్తుతం జోరందుకుంది. అధికార పార్టీ అండగా ఒక స్మగ్లర్ కొంత క్రింద ప్రాంతాల్లోని ప్రజలను భయభ్రాంతులను చేసి చందనం నరికిస్తున్నారు. ఫిబ్రవరి నెలలోనే 30 లక్షల విలువ చేసే ఎర్ర చందనం లారీల్లో తరలించినట్లు వినికిడి. ఫారెస్ట్ అధికారులు కూడా తమ వాటా తీసుకొని స్మగ్లర్లకు ఎప్పటి లాగానే చేయూత నందిస్తున్నారు. లారీల్లో పైన అరటి కాయల గెలలు క్రింద ఎర్ర చందనం దుంగలు నింపుకొని స్మగ్లర్లు యథేచ్ఛగా మద్రాసుకు సాగిపోతున్నారు. ఇదే ధోరణి మరి కొన్నాళ్లు సాగితే రాపూరు, వెలుగొండ అడవుల్లో ఎర్ర చందనం మొక్క చూద్దామన్నా కనిపించదు.

## గోరు చుట్టు పై రోకటి పోటు డ్రైనేజి సెస్సు!

ఇప్పటికే పంటకు వచ్చిన తెగుళ్లకు క్రుంగి పోయి వున్న రైతులకు గోరు చుట్టు పై రోకటి పోటయ్యింది డ్రైనేజి సెస్సు. కోర్టు తీర్పు వల్ల సాధారణ శిస్తులతో పాటు దీనిని కూడా ఏక కాలంలో చెల్లించాలని అధికారులు వత్తిడి చేస్తుండడంతో రైతులు విలవిల లాడి పోతున్నారు. ఎకరాకు సాధారణ శిస్తు 83 రూపాయలు చెల్లించడమే గగనమైన ప్రస్తుత పరిస్థితుల్లో 10 సంవత్సరాల సెస్సు 413 రూపాయలు చెల్లించే మనస్థితి రైతులకు పాలు పోవడం లేదు. డిశంబరు నెలలో కురిసిన వర్షాలు రైతును కృంగదీసాయి. ఈ ఏడాది పంట చేతి కొచ్చే వరకు నమ్మకం లేదు. చిన్న, సన్న కారు రైతులకు ఇది భారం గనుక సెస్సును వాయిదాలు గానే కట్టగలరు. ఈ విషయంలో జిల్లా శాసన సభ్యులు ప్రభుత్వాన్ని ఒప్పించ వలసి వుంది.

## అల్లూరులో పోటా పోటీగా ప్రచారం!

అల్లూరు జడ్‌పిటిసి, మండల టిసిలకు పోటీ చేస్తున్న అభ్యర్థులు పోటా పోటీగా తమ ప్రచారాన్ని బడా నేతల చాటున జోరుగా సాగిస్తున్నారు. కాంగ్రెస్ పార్టీ ప్రచారానికి మాజీ శాసన సభ్యుడు శ్రీ విష్ణువర్ధన రెడ్డి ప్రాతినిధ్యం వహిస్తుండగా, తెలుగు దేశంకు మాజీ సర్పంచ్ మేదా అశోక్ కుమార్ రెడ్డి, పార్టీ కన్వీనర్ ఆర్. బాబూరావులు మండల మంతా చురుకుగా తిరుగుతున్నారు. విష్ణువర్ధన రెడ్డి గడప గడపా ఎక్కి తిరుగుతుండడంతో కాంగ్రెస్ పరిస్థితి ఆశా జనకంగా వుంది. దేశం, మిత్ర పక్షాలు ప్రభుత్వ పథకాలను విడమర్చి చెప్పి ఓట్లు రాబట్టాలని చూస్తున్నాయి. జడ్‌పిటిసి నియోజక వర్గాన్ని గిరిజనులకు రిజర్వు చేసారు. కాంగ్రెస్ తరపున మాజీ అల్లూరు సర్పంచ్ చలంచర్ల సుబ్బయ్య, దేశం తరపున మాజీ మండలాధ్యక్షుడు తలపల వెంకట రత్నం పోటీ చేస్తున్నారు. ఇరువురూ అధికారంలో వున్నప్పుడు చెడ్డ పేరు తెచ్చుకోక పోయినా బడా నేతల చాటు బిడ్డలే అనాలి. దేశం అభ్యర్థి ఇస్కపల్లి ప్రాంతీయుడు కావడం వల్ల ఆ ఏరియాలో భారీగా ఓట్లు పడే అవకాశాలున్నాయి కాంగ్రెస్ అభ్యర్థికి అల్లూరు ప్రాంతంలో విష్ణు పుణ్యాన భారీ ఓట్లు రావడం ఖాయం. మండల టిసిలో 14 నియోజక వర్గాల్లో అభ్యర్థుల ఎంపిక పట్ల రెండు పార్టీలూ పప్పులో కాలేసాయి. ఎస్‌సి మహిళలకు రిజర్వు చేసిన మండలాధ్యక్ష పదవి కోసం అల్లూరు - 3 ప్రాదేశిక నియోజక వర్గం నుంచి కాంగ్రెస్ తరపున ఎ. ప్రభావతి, దేశం తరపున బట్టా విజయమ్మ పోటీ పడుతున్నారు. కానీ వీరిద్దరికీ అల్లూరు స్వగ్రామం కాదు. ఇటీవలే అల్లూరు వచ్చి స్థిర పడ్డవాళ్లు; ఓటర్ల లిస్టులో పేరున్న వారు. ఈ ఎంపిక పట్ల స్థానికుల్లో నిరసన వ్యక్త మవుతున్నది. విష్ణువర్ధన్ రెడ్డి ఓటున్న రెండవ ప్రాదేశిక నియోజక వర్గంలో తల్పున్న టిసిలు సి. ప్రసాద్, ఎ. బాలకృష్ణం రాజా మంచి నీళ్లలా ఖర్చు పెడుతున్నారు. ఈ వార్డులో పోటీ అల్లూరులో ప్రతిష్టాకరంగా మారింది. ఒకటవ ప్రాదేశిక నియోజక వర్గంలో సిపిఎం తరపున జిల్లా మహిళా కార్యదర్శి షేక్ రెహానా కాంగ్రెస్ అభ్యర్థి కత్తుల శేషయ్యకు మంచి పోటీ ఇస్తున్నారు. ఇస్కపల్లి డోజీ (దేశం), గప్ప (కాంగ్రెస్) మధ్య పోటీ కూడా తీవ్రంగా వుంది. సింగ పేటలో దేశంకు అభ్యర్థి కరువైన దుస్థితి నెలకొంది. సిపిఎం ఇందుపూరు, గోగుల పల్లిలో కూడా పోటీలో వుంది. ఎమ్మెల్యే జక్కా వెంకయ్య ప్రచారానికి రాకుండా స్థానిక నాయకులకే ఈ బాధ్యత అప్పగించడంతో పార్టీ శాఖ కార్యదర్శి రఘురామి రెడ్డి కష్టపడి తిరుగుతున్నారు. విష్ణు పై వున్న సానుభూతి కాంగ్రెస్ పార్టీకి ఓట్లు తెచ్చి పెట్టే అవకాశ ముంది. ఆయన మరింత మెరుగైన అభ్యర్థులను ఎంపిక చేసి వుంటే బాగుండేది. మండలంలోని 14 టిసిల్లో సింగ పేట తప్ప అన్నీ రిజర్వు అవడంతో పలువురు ఎన్నికల పట్ల వుత్సాహం చూపడం లేదు. ముఖ్యంగా పదవుల పై ఆశలు పెట్టుకొని వున్న తెలుగుదేశం పార్టీ వారైతే కుప్పకూలి పోయారు. కాంగ్రెస్ పార్టీ మొన్నటి ఎన్నికల్లో ఓటమిని సవాలుగా తీసుకొని ఈ ఎన్నికల్లో విజయం సాధించడం ద్వారా తమ సత్తా చూపించాలని వువ్విళూరుతున్నది.

## శవాల నిలయమైన పుణ్య క్షేత్రం!

భక్తికి ప్రశాంతతకు నిలయమైన పెంచల కోన క్షేత్రం గత మూడు నెలలుగా కుళ్లి పోయిన శవాలకు నిలయమై పోయింది. గత సంవత్సరం డిశంబర్ నెలలో మూడవ గుండం సమీపంలో పాత చాపలో చుట్టి వేసి వున్న ఒక యువతి శవం కన్పించింది. శవం కుళ్లి వాసన కొట్టిన తరువాత దీన్ని గుర్తించడం జరిగింది. కాని ఇంత వరకు శవం తాలూకు వివరాలు వెల్లడి కాలేదు. చాపలో చుట్టబడి వుండడం వల్ల ఎవరో హత్య చేసి ఇక్కడ పడేసారని చెప్పవచ్చు. రాజరాజేశ్వరి ఆశ్రమానికి అర కిలోమీటరు దూరంలో ఇటీవల ఒక వ్యక్తి శవం కన్పించింది. ఈ వ్యక్తి పురుగుల మందు తాగి చనిపోయినట్లు పోలీసులు చెబుతున్నారు. నెలల వ్యవధిలోనే రెండు శవాలు కోనకు పోయే మార్గంలో కన్పిస్తుండే సరికి భక్తులు హడలి చస్తున్నారు. పోలీసు అధికారులు పకడ్బందీ దర్యాప్తు చేసి హత్యల వెనుక అసలు విషయాలు రాబట్టాల్సి వుంది.

## మురుగు కాల్వల మరమ్మత్తులు చేయాలి!

పెన్నారు డెల్టాలోని మురుగు కాలువల మరమ్మతులు వెంటనే

కొరవ 8 పేజీలో

# నెల్లూరు పాలిట్రిక్స్

**విమర్శకుడు**

## జనార్థనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్థనరెడ్డి వారం రోజుల నుంచి జిల్లాలోనే వున్నారు. వెంకటగిరి, గూడూరు ప్రాంత జి.ప్ర.ప ఎన్నికల ప్రచారంలో పాల్గొనడంతోపాటు, నెల్లూరు మునిసిపాలిటీ అభ్యర్థిత్వాల ఎంపికను పర్యవేక్షిస్తున్నారు. మరి రెండు మూడు రోజులు ఇక్కడే వుంటారు.

జనార్థనరెడ్డి గారిలో ఓటమి నిరుత్సాహం మచ్చుకైనా లేదు. తాను ఉత్సాహంగా వుండగల్గడమే కాదు, కాంగ్రెస్ నాయకులను, కార్యకర్తలను ఛలోమని ఎన్నికల యుద్ధానికి తరుముతున్నారు. నిరాశా నిస్పృహలతో నీరసపడి పోయిన కాంగ్రెస్ కార్యకర్తలకు ఆయన ప్రోత్సాహం టానిక్ వలె పనిచేస్తోంది.

## మాగుంటను మళ్లీ కలిసిన ఆనం

మునిసిపల్ ఎన్నికలలో తమకు సహాయం చేయమని అభ్యర్థించడానికి ఆనం వివేకానందరెడ్డి, రామనారాయణరెడ్డి లిద్దరూ ఈరోజు (3తేది) మరొక సారి మాగుంట సుబ్బరామిరెడ్డి గారిని కలిశారు. ఆయన వీరికి కంగ్రాచ్యులేషన్స్ చెప్పి, కాఫీ ఇచ్చి, మర్యాద చేశారట. స్వతంత్రుడిగా పోటీనుంచి విరమించుకోవాలని అప్పటికే నిర్ణయించుకొని వుండడంతో సీట్ల సర్దుబాటుకు రెడీ అయ్యారు. కళ్యాణ్ ఫిలింస్‌లో పివి ప్రసన్నరెడ్డికి, వీరికి పర్య ఈ సాయంత్రం మరోక సమావేశం జరగబోతుంది!

సుబ్బరామిరెడ్డిగారు ఇప్పటికైనా వాస్తవం గ్రహించి పోటీ నుంచి తప్పుకోవడం సంతోష దాయకం. ఆయన మనఃస్ఫూర్తిగా తన అనుచరులచేత పనిచేయిస్తే టౌన్‌లో కాంగ్రెస్ గెలుపు సునాయాసమౌతుంది.

> **వేమారెడ్డి వెంకురెడ్డి గారికి క్షమాపణలు!**
>
> గతవారం జమీన్‌రైతు చివరి పేజీలో,ని తోటపల్లి గూడూరు కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ జి. శివకుమార్ రెడ్డి ప్రచార ప్రకటనలో పెద్ద పొరపాటు దొర్లింది. శివకుమార్ రెడ్డి తాత, మాజీ ఎమ్మెల్యే, పాత కాలం పెద్దాయన శ్రీ వేమారెడ్డి వెంకురెడ్డి గారిని "స్వర్గీయ" అని సంబోధించడం జరిగింది. వెంకురెడ్డి గారు బ్రతికే వున్నారు; ఆరోగ్యంగా తిరుగుతున్నారు. ఈ పొరపాటుకు క్షమాపణ తెలియజేస్తున్నాము.
>
> -మేనేజర్.

## గూడూరు ఛేర్మన్ టిక్కెట్ రెండు లక్షలకు అమ్మకం?

గూడూరు మునిసిపల్ ఛేర్మన్ టిక్కెట్ కేటాయించడానికి మాజీ విద్యార్థి నాయకుడు పాశం సునీల్ కుమార్ నుంచి ఒక తెలుగు నాయకుడు రెండు లక్షలు తీసుకున్నాడని వినికిడి. ఈ టిక్కెట్‌కు చాలా పెద్ద పోటీ ఏర్పడింది. గూడూరు టౌన్ సాధారణంగా దేశం పార్టీకి బలీయమైన స్థానం కావడంతో, టిక్కెట్ వస్తే గెల్చినట్లేనని భావించారు అందరూ. అందువల్లే అంత పోటీ! వీరందరిలోకి సునీల్ కుమార్ ముందుకు వచ్చి, సంబంధిత నాయకుడికి రెండు లక్షల రూపాయలు ఆఫర్ చేసి, అప్పటి కప్పుడు నగదు తెచ్చి చేతికిచ్చాడట. ఎవర్ని ఎంపిక చేయాలా అని తల పట్టుకుని కూర్చుని వుండిన ఆ నాయకుడికి ఈ ఆఫర్‌తో పరిష్కారం దొరికింది అప్పటి కప్పుడు టిక్కెట్ కేటాయించేశారు.

హరిజన రిజర్వుడు స్థానంలో సైతం పదవులకోసం పెద్ద పెద్ద మొత్తాలు ఇవ్వజూపడం మంచి అభివృద్ధి క్రిందనే భావించాలేమో! ఇటువంటి ఛేర్మన్లు అధికారంలోకి వస్తే జరగబోయేది ఏమిటి? రోడ్లలో గుంటలు గుంటలుగానే , కాలిన వీధి దీపాలు కాలినట్లే వుంటాయి- ఖజానాలో నిధులు మాత్రం కరిగి పోతుంటాయి. రాజకీయాలు ఎంత దిగజారి పోతున్నాయండీ! మంత్రి ప్రసన్నరెడ్డి గారు తన పార్టీపై పడిన ఈ నిందకు ఏమని సమాధానం చెప్తారో!

* * *

కాంగ్రెస్ అభ్యర్థి ఎంపిక ఇంకా జరగలేదు. దీనికి చాలా పోటీ వుంది. అయితే తెలుగు దేశం వలె దబ్బిచ్చి టిక్కెట్ కొనుక్కునే వారెవ్వరూ లేరు. టిక్కెట్ ఇచ్చి, ప్రచారం ఖర్చుకు జనార్థనరెడ్డి జేబు ఖాళీ చేయాలనుకున్నవారే ఎక్కువ. మునిసిపల్ ఎన్నికల భారమంతా ఎల్లసిరి గోపాలరెడ్డి మోస్తున్నారు.

* * *

(7వ పేజీలో)

## నెల్లూరు ముచ్చట్లు

(6వ పేజీ తరువాయి)

కావలి తెలుగుదేశం అభ్యర్థినిగా డిగ్రీ చదువుచున్న యువతి- రాధా మాధవిని ఎంపిక చేశారు. వేణుగోపాలరెడ్డి బాధ్యత స్వీకరించినా, టౌన్‌లోని అన్ని వర్గాలవారూ సహకరిస్తుండడం మూలా, కీచులాటలు లేకపోవడం విశేషం.

కాంగ్రెస్ అభ్యర్థినిగా మద్య





తరగతి గృహిణి శ్రీమతి చలంచర్ల దేవసేన ఎంపికైనారు. ఆమె ప్రచార భారం గ్రంధి యానాది శెట్టి భుజాలపై పడింది.

## బెజవాడ గోపాలరెడ్డిగారి సతీమణి కాలధర్మం

సాహితీవేత్త, ఉత్తర ప్రదేశ్ మాజీ గవర్నర్ డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి సతీమణి శ్రీమతి లక్ష్మీకాంతమ్మ 1తేది ఉదయం కన్నుమూశారు. ఆమె వయస్సు 73 సంవత్సరాలు.



లక్ష్మీకాంతమ్మగారు స్వర్గీయ తిక్కవరపు రామిరెడ్డి కుమార్తె. 1938లో గోపాలరెడ్డిగారు అవిభక్త మద్రాసు రాష్ట్ర మంత్రిగా వున్న సమయంలో వారి వివాహం జరిగింది. అది ఆదర్శవివాహం. ముహూర్తం గిహూర్తం లేదు.- రవీంద్రనాధ్ ఠాగూర్ జన్మదినమే లగ్నం; పురోహితులు, మంత్రాలు లేవు. - ఉన్నవ లక్ష్మీనారాయణ, అల్లూరు బాపినీడుల ఆశీర్వాదాలే మంత్రాలు! ఆ పెళ్లికి శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలచారి కూడా హాజరైనారు.

లక్ష్మీకాంతమ్మగారు గోపాలరెడ్డిగారి వలె రవీంద్రకవి శిష్యురాలు. శాంతినికేతన్‌లో, ఆంగ్ల, బెంగాలీ సాహిత్యం చదివారు. తమ కుటుంబ సభ్యులందరితోపాటు స్వాతంత్ర్య సమరంలో పాల్గొని, జైలుశిక్ష అనుభవించారు. ఆమెకు ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె వున్నారు.

ఈ పండు వయస్సులో సతీవియోగం గోపాలరెడ్డి గారికి తీరని వ్యధ కల్గిస్తున్నది. ఆయనకు మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

## దేశం, సిపిఎం మధ్య వైస్ ఛేర్మన్ పేచీ

దేశం, సిపిఎం పార్టీల మధ్య; వైటి నాయుడు, రమేష్ రెడ్డిల మధ్య నెల్లూరు మునిసిపల్ కౌన్సిల్ సీట్ల విషయంలో ఇంకా ఏకాభిప్రాయం కుదరలేదు. జిల్లా పార్టీ కన్వీనరు శ్రీ తేగా నారసింహారెడ్డిగారు మధ్యవర్తిత్వం నెరపుతున్నారు. సిపిఎం జక్కా వెంకయ్యగారు చివరకు 12 వార్డులకు ఒప్పుకున్నారట. రమేష్ రెడ్డికి అది అంగీకారమైంది కాని, చివరి నిముషంలో సిపిఎం, తమకు వైస్ ఛేర్మన్ కావాలని మరల పేచీ పెట్టింది. ఈ కోరిక తెలుగుదేశంలో ఎవరికీ అంగీకారం కాలేదు. ఎన్టీఆర్‌తో మాట్లాడి చెప్తామన్నారు. కానీ, రేపటిలోగా ఈ విషయమై తమకు స్పష్టమైన హామీ ఇస్తే తప్ప రాజీ పడేది లేదని వెంకయ్యగారు తేల్చి చెప్పారట. ఎన్టీఆర్ గారు సతీసమేతంగా ఒరిస్సాలో హనీమూన్ ట్రిప్ తిరుగుతున్నారు; ఆయన్ను వెతికి పట్టేదెవరు? మాట్లాడేదెట్లా? రేపు సాయంత్రం వరకు ఈ పేచీ పెరిగిపోతే పుంతలోతుంది!

రమేష్ రెడ్డి, వైటి నాయుడు మధ్య కూడా ఒకటి రెండు వార్డుల విషయంలో పంతాలు, పట్టింపులు తలెత్తుతున్నాయి. తేగాకు తల బొప్పి కట్టిపోతూంది- ఇద్దరి మధ్య కూర్చుని; ఇద్దరి వాదనలు విని!

## 662 నామినేషన్లు

నెల్లూరు మునిసి పాలిటీలో: 44 వార్డులకు గాను 715 నామినేషన్లు దాఖలైనాయి. స్క్రూటినీలో 53 ఎగిరిపోగా, 662 మంది నిలబడి వున్నారు.

ఛేర్మన్ పదవికి 37 మంది నామినేషన్ వేశారు. కాంగ్రెస్‌కు ఆనం వివేకానందరెడ్డి, తెలుగుదేశం వైటి నాయుడు, బిజెపి కరణం భాస్కర్‌ల మధ్య పోటీ వుంటుంది.

## ఆలపాటి ఆయుర్వేద వైద్యశాల

మాజీ మునిసిపల్ కౌన్సిలరు, టుటౌన్‌లో ముఖ్యమైన ఆనం అనుచరురాలు శ్రీమతి ఆలపాటి దశరథకుమారి తనయుడు డాక్టర్ ఎ. రాజేంద్ర ప్రసాద్ పడుగుపాడులో "ఆలపాటి ఆయుర్వేద ఆస్పత్రి" నెలకొల్పారు. రాజేంద్ర ప్రసాద్ కోయంబత్తూరులో ఏడున్నర సంవత్సరాలు ఆయుర్వేద వైద్యం అభ్యసించాడు. ఆయన తాత స్వర్గీయ ఆలపాటి వరదయ్య ప్రఖ్యాత ఆయుర్వేద వైద్యుడు. ఆ వారసత్వం మునుమడికి సంక్రమించింది. ఈ ఆస్పత్రిలో అల్సర్, కీళ్లవాతం, చర్మవ్యాధులు, కీళ్లనొప్పులు, డయాబిటీస్ తదితరాలకు చికిత్స వుంటుంది.

## బజారు ధరలు

మొలగొలుకులు

| | |
|---|---|
| 9672-పాతవి | 4,500.00 |
| 9672-కొత్తవి | 3,400.00 |
| 9674-పాతవి | 4,700.00 |
| 9674-కొత్తవి | 3,600.00 |
| సన్నాలు -పాతవి | 4,100.00 |
| మొలగొలుకులు 70Kg. | 620.00 |

బంగారం

## షేర్లు

2 పేజీ తరువాయి

నివేదిక పరిమిత ఫార్వర్డ్ ట్రేడింగ్‌ను మాత్రమే అనుమతిస్తుందని అంచనా. అంటే పూర్తిగా బ్రోకర్ల ఇష్టారాజ్యంగా నడిచే విధానం రాదు.

ఇదిట్లా వుంటే ఈ మధ్య బాడ్ డెలివరీలు అధికంగా వస్తున్నాయి. అంటే దొంగసంతకాలు, సంతకం సరిపోకపోవడం, నకిలీ సర్టిఫికెట్లు వంటివన్న మాట. అందువల్ల షేర్ల కొనుగోలు దారులు జాగ్రతగా వుండాలి.

మార్చి 4, 5 తేదుల వరకు భారీ కంపెనీ లైన టిస్కో, ఎసిసి, రిలయన్స్ వంటి షేర్లు బాగా పెరుగుతాయి. కమిటీ నివేదికలో ఏమాత్రం తమకు ప్రతికూలత కన్పించినా ఈ బ్రోకర్లే మార్కెట్‌ను పడగొడతారు. ఈ పెద్ద కంపెనీల షేర్లు వున్నవాళ్లు ఈ సమయంలో అమ్ముకొని, తిరిగి పదిరోజుల తర్వాత షేర్ల ధరలు తగ్గినప్పుడు కొనుక్కోవడం లాభం.





## కోవూరు సబ్ కోర్టులో

I.A. 469 / 94 : O.S. 72 / 87

- ముగుండ్ల వెంకటేశ్వర్లు
-పిటీషనరు/వాది

Vs

లక్ష్మిసెట్టి పెద మస్తానయ్య వగైరా
-రెస్పాండెంట్లు

### నోటీసు

2. లక్ష్మిసెట్టి చినమస్తానయ్య, S/o. వెంకయ్య
6. ఆవుల బుజ్జమ్మ

2,6 సాకిన్ పొంగూరు మర్రిపాడు మండలం, నెల్లూరు జిల్లా అను వారు పై నెంబరున పిటీషనరు default క్రింద త్రోసి వేయబడిన దావాను restore చేయమని దాఖలా చేసిన పిటీషను మీద మీకు నోటీసు నిమిత్తం 8.3.95 తేదికి వాయిదా వేసివున్నది. ఆ తేదిన మీరు పై కోర్టుకు ఉదయం 10.30 గంటలకు హాజరై మీ ఆక్షేపణ తెలుపు కొనేది. లేని ఎడల మీ పరోక్షమున తీర్మానించెదరు.

కోవూరు **ఉడాలి సుబ్రహ్మణ్యం**
25.2.95 పిటీషనరు వకీలు

### In the Court of Munsif Magistrate, Sidhout

S.C. No. 16/94

Rayalaseema Grameena Bank represented by its Branch Manager, Sidhout - Plaintiff

Vs

Shaik Mahaboob Saheb Son of Ramthu Miah, aged about 60 years, Muslem, Business, residing at Diguvapeta, Siddavattam Village, Siddahavattam Mandalam, Cuddapah District - Defendent No. 1

Plaintiff filed the suit for recovery of Rs. 1339.00 due on loan. Suit is posted to 18.3.95 for your appearance at 10.30 A.M. in the above Court. Failing which the suit will be decided in your absence.

Siddhout **B. Venkata Rathnam**
516237 Advocate for Plaintiff

**In the court of the Subordinate Judge : Nellore**

I.A. 197 / 95

I.A. 400 / 94 :: O.S. 18 / 81

1. శింగంశెట్టి వరలక్ష్మమ్మ
2. శింగంశెట్టి విజయకుమార్

- పిటీషనర్స్

1. పసుపులేటి జనార్ధన్ వగైరాలు

-రెస్పాండెంట్లు

To

పసుపులేటి జనార్ధన్ (Proposed Party)

అంబాపురం, నెల్లూరు అనువారికి

## నోటీసు

పై నెంబరు దావా 28.3.95 తేదికి ప్రతివాదికి నోటీసు నిమిత్తమై వాయిదా వేయబడి యున్నది. కాబట్టి ఆ రోజున ప్రతివాది వుదయం 10.30 కి పై కోర్టులో హాజరై తనకు ఆక్షేపణలున్న యెడల తెలుపు కొనవలసింది. లేకున్న పరోక్షమందు తీర్మానించ బడును.

పిడూరు నాగేశ్వరరావు
పిటీషనరు తరపున వకీలు

## ది నెల్లూరు కో ఆపరేటివ్ అర్బన్ బ్యాంకు

16/1245, గాంధీనగర్,
నెల్లూరు. ఫోన్: 26536

### ప్రకటన

ఇందు మూలమున తెలియజేయడ మేమనగా నెల్లూరు టవున్, కోటమిట్ట ము. వార్డు నం. 20 డోరు నం. 1461 కాపురస్థురాలు షేక్ రహీమున్నిసా అరఫ సాబ్జారి, W/o. మహబూబ్ బాషా తన తాలూకు ఈ క్రింది షెడ్యూలు దాఖలా ఆస్థి పత్రములు డాక్యుమెంటు నం. 7295/1985 మరియు 2425/1979 పబ్లిక్ కాపీలు దాఖలు పరచి ఈ బ్యాంకు నందు ఆయకపు అప్పు కోరుచూ ఒరిజనల్ పత్రములు చెదలు తిని పూర్తిగా పోయినవని తెల్పుచున్నారు. గనుక ఇందుకు సంబంధించి చూపుడు ఆడుమానములుగా గాని, ప్రోనోటు బాకీలుగా గాని, ఆడు మానములుగా గాని, ఇతరత్రా ఏ విధమైన బాకీలుగా గాని, అభ్యంతరములున్న యెడల ఈ ప్రకటన తేదీ నుండి 10 రోజుల లోపల బ్యాంకు వారికి వ్రాత మూలకముగా తెలియ జేయ కోరడమైనది.

### ఆస్థి షెడ్యూలు

నె.డి.రి. యిలాకా నెల్లూరు మున్సిపాలిటీలో చేరిన నెల్లూరు టవున్, కోటమిట్ట, మెక్లిన్స్ రోడ్డు, C.A.S. No. 32280 రు, ప్లాటు నం. 4/A రు గా యుండి ప్రస్తుత వార్డు నం. 20 రు డోరు నం. 1461 (పాత డోరు నం. 1410) గల పూరి యిల్లు వగైరాలకు హద్దులు. తూర్పు: సయ్యద్ హుస్సేన్ గారి యిల్లు స్థలం; దక్షిణం: సయ్యద్ అహమ్మద్ గారి యిల్లు స్థలం; పడమర: మెక్లిన్స్ రోడ్డు; ఉత్తరం: షేక్ మస్తాన్ గారి యిల్లు స్థలం. యీ హద్దులలోని 17 అంకణములు 20 వరరపు అడుగుల స్థలం, యిందులోని 4 అంకణముల పూరి యిల్లు.

కె. సూర్యనారాయణ కె.సి.ఎస్. అమర్‌నాథ్
కార్యదర్శి i/c అధ్యక్షులు

## పులివెందుల మున్సిఫ్ కోర్టులో

O.S. 131 / 94

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, వేంపల్లి

-వాది

Vs

అద్దంకి పార్థసారథి
S/o. నరసింహులు
క్రిష్ణ మెడికల్స్
Opp: గవర్నమెంట్ ఆసుపత్రి
కర్నూలు -ప్రతివాది

పై దావాలో ప్రతివాది నోటీసు కై వాయిదా పై కోర్టులో 20.3.95 తేదిన ఉన్నది ఆక్షేపణలున్న తెలుపు కొనవచ్చును.

పులివెందుల జి. ప్రభాకర శాస్త్రి
22.2.95 అడ్వకేటు

## ది నెల్లూరు కో ఆపరేటివ్ అర్బన్ బ్యాంకు

16/1245, గాంధీనగర్,
నెల్లూరు. ఫోన్: 26536

### ప్రకటన

ఇందుమూలముగా తెలియ జేయడ మేమనగా నెల్లూరు టవున్, నవాబుపేట D2/4, 5, 6, 7 కాపురస్థురాలు, కొండేటి ఆదిశేషమ్మ, W/o. Late నరశింహము, ఈ బ్యాంకు నందు ఆయకపు అప్పు కోరుచూ ఈ క్రింది షెడ్యూలుకు సంబంధించిన స్థిరాస్థి ఆస్థి పత్రములు డాక్యుమెంటు నం. 85/88 పబ్లిక్ కాపి దాఖలు పరచి, ఒరిజనల్ పత్రములు పోయినవని తెల్పుచున్నారు. ఇందుకు సంబంధించి చూపుదు ఆడుమానములు, ఆడుమానములు, ప్రోనోటు బాకీలుగా గాని లేక ఏ ఇతర అభ్యంతరములున్న యెడల బ్యాంకు వారికి వ్రాత మూలకముగా ఈ ప్రటన తేది నుండి 10 రోజుల లోపల తెలియజేయ కోరడమైనది.

### ఆస్థి షెడ్యూలు

నె.డి.రి. యిలాకా నెల్లూరు మున్సిపాలిటీలో చేరిన నెల్లూరు టవున్, నవాబు పేట, బజారు వీధి, ము. వార్డు నం. 2 రు, డోరు నం. 4, 5, 6, 7 గల మిద్దె యిల్లు పూరి యిల్లు వగైరాలకు హద్దులు. తూర్పు: విన్నకోట వెంకట శేషయ్య యిల్లు స్తలమునకు యీ యింటి ఖాలీస్తలమునకు మధ్య కొంత వరకు సదరు శేషయ్య గారి యింటి గోడను అనుకొని ప్రహరీ గోడ; దక్షిణం: శెట్టిగుంట రోడ్డు; పడమర: చల్లా వెంకయ్య నుండి రుక్మిణమ్మ కొన్న స్థలంనకు యింటికి మధ్య దాసరి వెంకయ్య, రామయ్య గార్ల ప్రహరీ గోడ ఉత్తరం: కె. బాలకృష్ణయ్య స్థలంనకు యీ యిండ్ల వర్షపు నీరు కాలువకు మధ్య కోలపల్లి బాలకృష్ణయ్య గారి నీరు పోవుటకు గల కాలువ.

యీ హద్దులలోని 46 1/2 అంకణముల స్తలం, యిందులోని మిద్దె యిల్లు 4 1/2 అం. పెంకుటిల్లు 9 3/4 అం. పూరి యిండ్లు 4 అంకణములు.

కె. సూర్యనారాయణ కె.సి.ఎస్. అమర్‌నాథ్
కార్యదర్శి i/c అధ్యక్షులు

# శివారెడ్డి పద్యాలు

ఎంతకాలమైందొయేనుసత్యానంద
ఆశ్రమానికొచ్చిఅడుగుమోపి
ధన్యమాయెజన్మ దర్శించ శివరాత్రి
ఇంతకంటెభాగ్యమేమికవికి!

దేవుడన్నగుళ్ళుదేవాలయాలన్న
ఆశ్రమాలన్నఅమితమోజు
అయొక గోల్లుతెను ఆరోజులికరావు
తప్పుగాదు దాన్నితరచరాదు!

## జనవాణి

3 పేజీ కొరవ

గణనీయంగా పెరుగుతుంది. తీవ్ర నిధుల కొరతను ఎదుర్కొంటున్న రాష్ట్ర ప్రభుత్వానికి ఇది మంచి ఆదాయవనరు కాగలదు.

గూడూరు. -కె. కృష్ణ

### పార్ట్ టైమ్ లెక్చరర్లను ఆదుకోవాలి!

1983లో తెలుగుదేశం పార్టీ అధికారంలోకి వచ్చిన సమయంలో పోస్టు గ్రాడ్యుయేషన్ పూర్తి చేసిన నిరుద్యోగులను దృష్టిలో పెట్టుకొని వారిని పార్ట్‌టైమ్ లెక్చరర్లుగా పనిచేయడానికి అవకాశం కల్పించింది. ఈ లెక్చరర్లకు గంట కాలం విద్యా బోధన చేసినందుకు 20 రూపాయల స్వల్ప వేతనం ఏర్పాటు చేసింది. 25.11.93 నాటికి కళాశాలల్లో పనిచేస్తూ అప్పటికి అయిదు సంవత్సరాల కాలం పార్ట్ టైమ్ లెక్చరర్లుగా పనిచేసిన వారందరినీ రెగ్యులర్ చేయడానికి 166 నంబర్ జి.ఓను రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశ పెట్టింది. కాని అది అమలు జరుగలేదు. మళ్లీ అధికారంలోకి వచ్చిన ఎన్టీరామారావు ఈ విషయంలో చొరవ చూపించి పార్ట్‌టైమ్ లెక్చరర్ల బ్రతుకులు బాగు పర్చను వీరందరినీ రెగ్యులరైజ్ చేయాలని మనవి.

నెల్లూరు. -పి. శ్రీహరి.

### టీచర్ పోస్టులపై తాత్సార వైఖరి!

ప్రభుత్వాలు వస్తున్నాయి పోతున్నాయే తప్ప గత ఆరేళ్ల నుండి టీచర్ పోస్టులను భర్తీ చేయకుండా తాత్సార వైఖరిని అవలంబిస్తున్నాయి. కాని ఎట్టకేలకు గత కాంగ్రెస్ ప్రభుత్వం నిరుద్యోగులపై దయతలచి నోటిఫికేషన్ విడుదల చేసి పరీక్షలు, ఇంటర్వ్యూలు పూర్తిచేసింది. పరీక్షలు అత్యంత పకడ్బందీగా నిర్వహించిన దానికి వుదాహరణగా 1:3 నిష్పత్తిలో వచ్చిన అభ్యర్థులని చెప్పవచ్చు. కోర్టులో వ్యాజ్యాల కారణంగా పోస్టులు భర్తీ చేయడంలో ఆలస్యమై ఆ ప్రభుత్వం దిగిపోయింది. నిరుద్యోగ ఉపాధ్యాయులందరూ కలసి ఎంతో ఆశతో తెలుగుదేశం పార్టీకి ఓట్లేసి గెలిపించారు. ప్రచార పర్యటనలో వున్న రామారావును కావలిలో ఈ సమస్యపై అడిగితే 'అధికారంలోకి రానివ్వండి బ్రదర్' నిరుద్యోగ ఉపాధ్యాయులందరికీ వుద్యోగాలిస్తానని హామీ ఇచ్చారు. ట్రిబ్యునల్ తీర్పు కూడా వచ్చింది. అయినా ఇంత వరకు పట్టించుకొనేవారు లేరు. విద్యామంత్రిగారేమో సుప్రీం కోర్టు వెళతానంటున్నారు. దయనీయ పరిస్థితిలో వున్న ఉపాధ్యాయ నిరుద్యోగుల పై దయ తలచి ప్రభుత్వం ఆదుకోవాలని మనవి.

మలుమూడి -మన్నెప్రసాద్.

### నేతల తీరువల్ల పార్టీకి ముప్పు!

పార్టీ నాయకుల తీరువల్ల కాంగ్రెస్ పార్టీ భ్రష్టుపట్టి పోతూంది. మొన్నటి అసెంబ్లీ ఎన్నికల్లో ఓటమి కూడా వీరికి గుణపాఠం నేర్పలేదు. ఇంత జరిగినా స్థానిక ఎన్నికల్లో పార్టీ తరఫున పోటీ చేయను పలువురు కార్యకర్తలు ముందుకొచ్చారు. కాని ఆ నాయకులే పార్టీ చిహ్నాన్ని మునిసిపల్, కార్పొరేషన్ ఎన్నికల్లో పార్టీ తరఫున పోటీ చేసేవారికి ఇవ్వమన్నారు. ఈ విషయమై పార్టీ కార్యకర్తల్లో తీవ్ర అసంతృప్తి రేగడంతో మళ్లీ నిర్ణయాన్ని మార్చుకొని ఎన్నికల ముందు అనవసర రగడ సృష్టించారు. పార్టీని పటిష్ట పరచడంలో పిసిసి అధ్యక్షుడు కమాలుద్దీన్ అహమ్మద్ ఏమాత్రం శ్రద్ధ చూపించడం లేదు. గాంధీ భవన్‌లోనే విజయవాడ శాసన సభ్యురాలు రత్నకుమారి ప్రదర్శించిన రౌడీయిజం; సిఎల్‌పి నాయకునిగా ఎన్నికైన విజయభాస్కరరెడ్డి అసెంబ్లీకి గైర్హాజర్ అవుతున్న తీరు పార్టీ శాసనసభ్యుల్లో నైతిక స్థైర్యాన్ని హరించి వేస్తున్నాయి. ప్రధాని పివి నరసింహారావు నాన్పుడు ధోరణి పార్టీని ఆంధ్రప్రదేశ్‌లో [illegible]ంగ దీస్తున్నది. నేతలు తమ తీరును ఎప్పుడు మార్చుకొని పార్టీ ప్రతిష్టకుపాటు పడతారో?

గూడూరు.-కె. హరిప్రసాదరెడ్డి.

## జిల్లావార్తలు

5 పేజీ కొరవ

చేపట్టాలని అల్లూరు శాసన సభ్యుడు జక్కా వెంకయ్య డ్రైనేజీ బోర్డు ఛైర్మన్ కె రామకృష్ణయ్యను కలసి విజ్ఞప్తి చేశారు. 28 తేదీ రామకృష్ణయ్య సోమశిల అతిథి గృహంలో జిల్లాలోని డ్రైనేజీ పరిస్థితి పై అధికారులతో కలసి సమీక్షించారు. అల్లూరు మండలంలోని చెంగల్వ వాగు ఏటా 5 వేల ఎకరాలను ముంపుకు గురి చేస్తుందని, దీని మరమ్మత్తులు వెంటనే చేపట్టాలని వెంకయ్య కోరారు. అల్లూరు స్టాంపును బోగోలు చెరువు నుంచి త్రవ్వాలని, అల్లూరు పొలాల గుండా నాయుడుపేట వెల్లువ కాల్వ స్టాంపులో కలపాలని కోరారు. జలదంకి మండలం చామ దల కొత్త చెరువు కలజా నుంచి ప్రారంభమయ్యే పిల్లవాగులో మేటను తొలగించి మరమ్మత్తులు చేపట్టాలన్నారు. కోవూరు ఏటి కాలువ సక్రమంగా లేక పోవడం వల్ల దువ్వూరు, ముక్తాపురం, అన్నారెడ్డి పాళెం, మినగల్లు, దామర మడుగు, పాటూరు. కోవూరు గ్రామాలలో [illegible] వేల ఎకరాలు ముంపు [illegible] వడుతున్నట్లు వివరించారు. రామకృష్ణయ్య కలెక్టర్ డాక్టర్ ప్రేమచంద్‌తో సమావేశమైన అనంతరం తెలుగు గంగ పనుల పరిశీలనకు వెళ్లారు.

### 8 ఎం.టి.సిలు తెలుగుదేశం వశం!

జిల్లాలోని 553 ఎం.పి. టిసి స్థానాలకుగాను 8మంది తెలుగు దేశం అభ్యర్థులు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. సిపిఎం, మరోచోట ఒక ఇండిపెండెంట్ అభ్యర్థి కూడా ఏకగ్రీవంగా ఎన్నిక కావడంతో ఈ సంఖ్య 10కి చేరుకుంది. 11 చోట్ల వివిధ కారణాల వల్ల ఎన్నికలు నిలిపేశారు. మొత్తం స్థానాల్లో 425 చోట్ల కాంగ్రెస్, 440 చోట్ల తెలుగుదేశం, 70చోట్ల సిపిఎం, 19చోట్ల సిపిఐ, 5చోట్ల బిజెపి అభ్యర్థులు రంగంలో వున్నారు. వీరు గాక మరో 320 మంది ఇండిపెండెంట్లతో కలుపుకొంటే 1360 మంది పోటీలో వున్నారు.

## నెల్లూరు జిల్లా గ్రామ స్వరాజ్య సంఘం, కందుకూరు

## ఖాదీభాండారు

కాపువీధి, అలంకార్ లాడ్జి ఎదురుగా, నెల్లూరు.

### 35% గొప్ప తగ్గింపు

మహాశివరాత్రి, రంజాన్, ఉగాది పండుగల సందర్భంగా ఖాదీ వస్త్రముల పై రూ. 1 టికి 0.35 పైసలు రిబేటు 24.2.95 తేది నుండి 31.3.95 తేది వరకు ఇవ్వబడును. శిల్కు పై 15% పాలిస్టరు పై 30% ఇవ్వబడును. మా వద్ద రెడిమేడ్ వస్త్రములు వచ్చి ఉన్నవి. గమనిక: నెల్లూరు టవున్‌లో రాష్ట మరియు సెంట్రల్ గవర్నమెంట్ వారి ఏకైక ఖాదీభాండారు ఇది ఒక్కటే.

మేనేజరు

**In the Court of the Munsif Magistrate, Sidhout**

O.S. No. 77/94

Rayalaseema Grameena Bank represented by its Branch Manager, Sidhout

- Plaintiff

Ragala Venkataiah died his L.R,
Ragala Venkata Subbaiah
Son of Late Venkataiah,
aged about 45 years,
Hindu, Business, residing at
Chinna Kothapallil Village,
Vontimitta Mandalam,
Cuddapah District

- Defendent No. 2

Plaintiff filed the suit for recovery of Rs. 4044.00 due on loan. Suit is posted to 9.3.95 for your appearance at 10.30 A.M. in the above Court. Failing which the suit will be decided in your absence.

Siddhout **B. Venkata Rathnam**
516237 Advocate for Plaintff

లక్ష్మీపార్వతి సినీ మోజు

# "నాకూ ఒక చిత్రానికి దర్శకత్వం వహించాలని వుంది"

హైదరాబాద్‌లో ప్రతి రోజూ సినిమా ఫంక్షన్ ఏదో ఒకటి ఉంటుంది. సన్నిహితుల కార్యక్రమాలకు ఎలాగో వీలు చేసుకుని ఎన్‌టిఆర్, ఆయన సతీమణి లక్ష్మీపార్వతి హాజరవుతున్నారు. ఒకసారి సినిమా వాళ్లంతా తన కళ్ళ ముందు కనిపించే సరికి ఎన్‌టిఆర్ హృదయం ఉరకలు వేయడం సహజమే. వేటూరి సన్మాన సభలో డైరెక్టర్ కె. విశ్వనాథ్‌ను చూసి, "మీరు నాతో ఒక సినిమా తీస్తానంటే నేను రెడీ; ఛాలెంజ్ వారిది; నిర్ణయం మీది" అన్నారు ఎన్‌టిఆర్! అలాగే మోహన్‌బాబు కొత్త చిత్రం ప్రారంభోత్సవంలో "మరోసారి నా తడాఖా చూపిద్దామా నిపిస్తోంది" అని ఎన్‌టిఆర్ అంటే, తొలి షాట్‌కు దర్శకత్వం వహించిన లక్ష్మీపార్వతి "డైరెక్షన్ ఇంత తేలిక అయితే, నాకూ ఒక చిత్రాన్ని డైరెక్ట్ చేయాలని ఉంది" అన్నారు. ఎన్‌టిఆర్‌కు సినిమా రంగం మీద ఇంకా మోజు తీరకపోతే, ఆయన సతీమణికి కొత్తగా మోజు పుట్టుకొచ్చినట్లుంది.

## శ్రీదేవి నటించాలని కోరుకొంటున్న పాత్ర

శ్రీదేవి ఎన్నో చిత్రాలలో ఎన్నో పాత్రలు ధరించింది. కాని, ఆమె ధరించాలని ఉవ్విళ్లూరే పాత్ర ఏదైనా ఉందా అని అడిగితే, ఆమె కాసేపాలోచించి, ఇలా అంది "నేను శ్రీదేవిని కాదు; ధరిస్తున్న ఫలానా పాత్రనే - అనే భావంతో ఏ సినిమాలో నటిస్తానో అదే నాకు నచ్చిన, నేను మెచ్చిన పాత్ర అవుతుంది. అలాంటి పాత్ర ఇక ఎప్పుడు లభిస్తుందో" అని కిలకిలా నవ్వింది. ఇప్పుడిప్పుడు కాస్త వయసు పెరిగిన ఛాయలు ఆమె ముఖంలో కనిపిస్తున్నాయి.

## "వద్దు బావా! తప్పు"

ఇదొక విపరీతార్థాలకు దారి తీసే చిత్రం పేరు. బావా మరదలుకు సంబంధించిన కథ. ఐతే, ఆ తప్పేమిటో చిత్రం చూసిన తర్వాత తెలుస్తుంది. రాజేంద్ర ప్రసాద్, వినీత, రాజ్‌కుమార్, భరణి, ఎ.వి.ఎస్, ఇంద్రజ, వై. విజయ, శివాజీ రాజా, నాగరాజు, ఐరన్ లెగ్ శాస్త్రి, గుండు హన్మంత రావు, కళ్లు చిదంబరం వగైరా పాత్ర ధారులు. దర్శకత్వం: అజయ్ కుమార్.

## అనురాధా ఫిలిమ్స్ డివిజన్ కొత్త చిత్రాలు

ప్రస్తుతం "అడవిదొర" చిత్రాన్ని నిర్మిస్తున్న అనూరాధా ఫిలిమ్స్ డివిజన్ సంస్థ మనీషా కోయిరాలాతో "వార్నింగ్" నగ్మాతో "ప్రియా.. ప్రియా.. ప్రియా", బాలలతో "టింకూ... రింకూ" చిత్రాలను నిర్మిస్తారట.

# సెన్సార్‌కు చెవులుంటే ఈ బూతు డైలాగులెట్లా జొరబడుతున్నాయి?

మన సాంప్రదాయాలు పాటిస్తూ, మన సమాజంలో ఎత్తి చూపడానికి ఎన్ని సమస్యలు లేవు? అయినా, ఇది వరకటి కన్నా ఇప్పుడు ఎక్కువగా పాశ్చాత్య చిత్రాల ప్రభావం - హింస, అశ్లీలం మన చిత్రాలలో బాగా చోటు చేసు కుంటున్నాయి. పాటలలోనూ ద్వంద్వార్థాలు బాగా ధ్వనిస్తున్నాయి. ఇటీవల "లేడీ బాస్" చిత్రంలో కూడా "గ్రీజు వేయించుకోవడం" అనే జుగుప్సా కరమైన మాట పలుసార్లు వినిపిస్తుంది. సెన్సార్ బోర్డు చూసీ చూడనట్లు ఉంటోంది! సెన్సార్ బోర్డుకు ఉన్న నియమ నిబంధనలను ఏ మాత్రం పట్టించుకోకుండా ఇష్టమొచ్చినట్లు వ్యవహరిస్తే ఎలా? ఇటీవల పౌరసంబంధాల శాఖకు మంత్రియైన దాడి వీరభద్ర రావు అన్నట్లు "పైరవీలు ఎక్కువగా జరుగు తున్నాయి. సెన్సార్

(తరువ 10 పేజీలో)



నెల్లూరు రోటరీ క్లబ్ ద్వారా కె. గోపాలరెడ్డి విరాళమిచ్చిన వీల్‌ఛెయిర్‌ను మదర్ థెరిస్సా హోం సిస్టర్‌కు అందజేస్తున్న గోల్డ్‌ప్లాట్ కంపెనీ అధినేత డి. చిదంబరం

# లతగారూ, ఇంక పాడవద్దు - ప్లీజ్!

"నేను నేపథ్య గానం చేయడానికి ముందు లత కంఠ మంటే చెవి కోసుకునే వాడ్ని. ఇంత కాలం ఆమె పాడుతోంది; వయసు మీద పడుతోంది కదా? ఇక నేపథ్య గానం మానేసే సమయం ఆమెకు ఆసన్నమైందేమో అనిపిస్తోంది; వయసు కొద్దీ గొంతులో వచ్చే 'జీర' ను తప్పించడం ఎవరి తరమూ కాదు. నా కటువంటి సమయమే వస్తే ప్లేబాక్ పాడడం నుంచి తప్పుకుంటాను. శాస్త్రీయ సంగీతం గానం చేసేటప్పుడు గొంతు 'జీర'ను ఎవ్వరూ పట్టించుకోరు. కచ్చేరీలు కంఠంలో ప్రాణం ఉన్నంత వరకు చేయవచ్చు. ఎటొచ్చీ నేపథ్య గానం మాత్రం పనికి రాదని నా అభిప్రాయం" అన్నారు జేసుదాసు.

**జేసుదాసు ఉచిత సలహా!**


Statement about ownership and other particulars about the News Paper

ZAMINRYOT (Telugu Weekly)

Nellore - 524 004. Andhra Pradesh

FORM IV (See Rule 8)

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | : | 3rd Cross Street<br>Savithri Nagar<br>NELLORE - 524 004. (AP) |
| 2. | Periodicity of Publication | : | Weekly |
| 3. | Printer's Name<br>Nationality & Address | :<br>: | N. Dolendra Prasad<br>Indian<br>CAM Compound<br>NELLORE - 524 003. |
| 4. | Publisher's Name<br>Nationality & Address | : | - do - |
| 5. | Editor's Name<br>Nationality & Address | : | - do - |

6. Name and Addresses of the individuals who own the news paper and partners or Share holders holding more than one percent of the total capital.

ZAMINRYOT COMMITTEE

| | | | |
|---|---|---|---|
| 1. | Sri T. Vanamali<br>3rd Cross Street<br>Savithri Nagar<br>NELLORE - 524 004 | : | Secretary |
| 2. | Sri N. Dolendra Prasad<br>CAM Compound<br>NELLORE - 524 003. | : | Member |
| 3. | Sri N. Kosal Ram<br>No, 8 Sri Ram Colony<br>Abhiramapuram<br>MADRAS - 600 018. | : | Member |
| 4. | Sri N. Yamini Chandra<br>Manager - Andhra Bank<br>Vakadu, NELLORE DT | : | Member |

I, N. Dolendra Prasad here by declare that the particulars given above are true to the best of my knowledge and belief.

N. DOLENDRA PRASAD, Publisher


## ఇంత చచ్చు చిత్రీకరణకు ఒక దర్శకుడు అవసరమా?

# లేడీ బాస్

"లేడీ బాస్" అనే పేరు విని ఇదొక ఆంగ్ల భాషా చిత్రం అనుకోకండి. ఇది అచ్చతెలుగు చిత్రం. నూటికి నూరు పాళ్లు తెలుగు వాడైన ఈ చిత్ర దర్శకుడు కోడి రామకృష్ణకు ఈ చిత్రానికి తెలుగు పేరు పెట్టేందుకు తెలుగులో పదాలు దొరికి నట్టు లేదు పాపం.

ఈ చిత్రంలో లేడీబాస్ ఝాన్సీ (విజయ శాంతి) ఇంట్లో అంట్లు తోమటం నుంచి, మంత్రిని నిలవేసి దుమ్ము దులపటం వరకు అన్నిటా, అన్ని చోట్లా తానే "బాస్ గా వ్యవహరిస్తుంది." చిత్రం ఆది నుంచి అంతం వరకు రక రకాల పాత్రల్లో, పలు రకాల వేషాల్లో సర్వాంతర్యామిగా, సర్వాధికారిగా ఝాన్సీ వ్యవహరిస్తుంది. మిగతా పాత్రలు చిత్రం నిండుగా, దండిగా వున్నాయి. ఈ పాత్రలు మట్టి పాత్రలుగా, ఇత్తడి పాత్రలుగా నిరుపయోగంగా నిలుస్తాయి. అట్లని సర్వమూ తానేగా వీర విహారం చేసే ఝాన్సీ పాత్ర బంగారు పాత్ర కాదు. అదొక కంచు పాత్ర. కంచు మ్రోగినట్టు కనకంబు మ్రోగునా అన్నట్టు, ఝాన్సీ అనే కంచు పాత్ర రణగొణ ధ్వనులు చేస్తుంది. ముఖ్యంగా ఈ పాత్ర చేసిన హంగామా అంతా పలు రకాల విధానాలతో సంఘ విద్రోహ శక్తులను, తన వ్యతిరేక వ్యక్తులను చితక బాదటం, కాల్చటం, చంపటం, ఝాన్సీ పాత్రను పోషించిన నాజూకైన విజయ శాంతి చేత

గ్రిద్దలూరు గోపాలరావు

జబ్బ పుష్టి, కండ పుష్టి గల బలిష్టులను తన్నించటం, చావ బాదించట మనేది- అదీ ఒక చోట కాదు, ఒక మాటు కాదు చిత్రం ఆద్యంతం చూపించటం - చాలా అసహజంగా వుంది. అదే పనిగా చిత్ర మంతా చితక బాదటం, తన్నటం చూపించటం వల్ల ఈ దృశ్యాలన్నీ ముఖం మొత్తుతున్నాయి. ఈ విధంగా చిత్రమంతా చావ బాదటం లాంటి దృశ్యాలున్న చిత్రానికి ప్రత్యేకించి ఒక దర్శకుడు అవసరమా అనిపిస్తుంది. ముష్టి యుద్ధాలు నేర్పే నేర్పరి వుంటే చాలుగా!

కోడి రామకృష్ణ దర్శకత్వంలోని ప్రతిభ ఎక్కడా కనిపించదు. ముష్టి యుద్ధాలు చూపి మెప్పు పొందాలను కున్నాడు. అతని ప్రయత్నం చప్పబడి పోయింది. "అస్త్రి మూరెడు ఆశ బారెడు" చిత్రంలో కోడి రామకృష్ణ దర్శకత్వంలోని నైపుణ్యం బారెడు నుంచి మూరెడుకు కుదించుక పోయినట్టు రుజువైంది; ఇక ఈ చిత్రంలో అది మూరెడు నుంచి జానెడుకు కుచించుక పోయింది. ముష్టి యుద్ధాల తర్వాత దర్శకుడు తన విజయం గోసం అశ్లీలాన్ని ఆశ్రయించాడు. ఆదిత్య వ్రాసిన జుగుప్సాకరమైన సంభాషణలకు ఆమోద ముద్ర వేశాడు. ఒకామె చమటలు పట్టి ఇంట్లోంచి బయటికొచ్చి ఎవరో ఒకడొస్తే వాడితో "గ్రీజు" వేయించు కున్నానంటుంది. దర్శకుడు ఇంత నీచానికి దిగజారినా ఓటమే మిగిలింది.

(తరువ 10 పేజీలో)

## గ్రంథసమీక్ష

4 పేజీ కొరవ

బ్రదికియుందు తెలుగు పద్య కవిత
అని కవి దీవెన.

నండూరి వారి ఒక సభలో సమకాలీన ప్రజా సమస్యల పట్ల పద్యం ఏ విధంగా స్పందింప చేస్తుందో నిరూపించారు. పద్యమనేది ఒక శక్తిమంత మైన భావ వాహిక. దానిని యీ పుస్తకంలో సోదాహరణంగా నిర్వచించిన సాహిత్య శిల్పి నండూరి వారు. వీరి లేఖిని నుండి వెలువడిన శిల్పమేఖల, కవిత్రయం పద్య, గద్య రచనలతో లబ్ధ ప్రతిష్ఠులు రచయిత. ప్రాచీన కవిత్వంలో పదాడంబరము, పాండిత్య ప్రకర్ష వుందని కొందరి భావం. 'విశ్వశ్రేయః కావ్యం' కనుక కవిత్వ లక్ష్యం జగద్ధితమే!

' పాతదైన దెల్ల బంగారమూ - కాదు
కొత్తదైనదెల్ల చెత్త కాదు
మంచి ఎచటనున్న పొంచి గైకొవచ్చు
ప్రాజ్ఞుడైన యెడల పండితుండు '

అని పాత క్రొత్తల మేలు కలయికగా యీ గ్రంథాన్ని రచించారు. కవి సృష్టి రమ్యం కావచ్చు. రోత గొలిపేది కావచ్చు. ఉత్తమం కావచ్చు. భయంకరమూ కావచ్చు. ప్రసన్నమూ కావచ్చు. వికృతం కావచ్చు. ఏదైనా కవిచే దర్శింపబడి, భావితమై సృష్టింప బడినచో అందులో రసస్ఫూర్తి వుండును. కవి ద్రష్ట, స్రష్ట " అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః " అని సూక్తి. నన్నయ నాటి కవిత ప్రబంధ రీతిలో శబ్దాడంబరాన్ని, పాండిత్యాన్ని మోసేదిగా వున్నా అందులో శిల్ప సౌందర్యముంది-" గంగనిజాంగ దీప్తులెసగం బనుదెంచి " అను పద్యంలో బంధు పూర్వక గకారం, అక్షర రమ్యత, శ్రుతి సుభగత్వం కలిగి పాఠకుణ్ణి ఆకట్టుకొనే శబ్దశక్తి వుంది. వేయి సంవత్సరాల కవితా యుగంలో వెలసిన, వెలిగిన మహాకవుల రచనల నుండి పద్యాల నెన్నుకొని, సంక్షిప్త వివరణతో యీ గ్రంథం రచింప బడింది. ఆధునిక యుగంలో నాటక కవుల పద్యాలు ప్రజలలో చైతన్యం తెచ్చాయని, ఆ పద్యాలు ప్రజలకు నచ్చాయని నిరూపించారు. సూక్తులు, సామెతలు పద్యాలలో యిమిడి రసస్ఫూర్తి కలిగించాయని చెప్పారు. కవితకు జీవనాలు కర్తవ్య ప్రబోధమని, కవిత జగత్కల్యాణం కోసమని తెలుగు కవితకు ఉజ్వల భవిష్యత్తు ఉందని రచయిత నిర్వచించారు. 95 పేజీలున్న యీ పుస్తకం 80 రూపాయలు కావడం సామాన్య పాఠకుడికి కొంచెం కష్టమే! పదిమంది చదువు కొనుటకు పుస్తక ధర పరిమితంలో ఉంచటం అవసరం. కవులకు లోకదృష్టి, సామాజిక స్పృహ అవసరమని, వేమన పద్యాలు, చిలకమర్తి వారి పద్యాలు, జంధ్యాల పాపయ్య శాస్త్రి గారి వంటి ఆధునిక కవుల పద్యాలు కూడా యిందు రూపొందినవి. సాహిత్యాభి లాషియైన పాఠకుడు యీ గ్రంథాన్ని చదివి ఎన్నో విషయాలు తెలుసుకో గలడు. సరస్వతీ ముఖ చిత్రంతో ముచ్చటగా, అవతరించిన యీ పద్యశిల్పం గుణములో అనల్పం.



మున్సిపల్ ఎన్నికలలో 13వ వార్డు కాంగ్రెస్ అభ్యర్థినిగా నామినేషన్ దాఖలు చేస్తున్న నెల్లూరు టౌన్ మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు శ్రీమతి పందిళ్లపల్లి ఆదెమ్మ

## సమీక్ష

9 పేజీ కొరవ

"ఇంటి ఇల్లాలే మహారాణవుతుంది" - అని పాడుతూ విజయశాంతి తన కుటుంబ సభ్యులైన పోలీస్ ఆఫీసరు, కలెక్టర్ల ముందు నృత్యం పేర వేసిన వికారపు గంతులు అసభ్యంగా వున్నాయి. ఇంకా ఎన్నో చిత్ర విచిత్రమైన ఊహాతీతమైన, అసాధ్యమైన, అసహజమైన, అసహ్యమైన సన్నివేశాలున్నాయి.

ముష్టి యుద్ధాలతో మునిగి పోయిన చిత్రంలో ఇక కథకు స్థాన మెక్కడుంటుంది. ఉన్నంతలో వంకర టింకరగా, గందర గోళంగా అర్థం పర్థం లేకుండా రెండు ఉపకథలను జోడించు కుంటూ క్రిందా మీదా పడుతూ నడుస్తుంది. అంతా పాత ఫక్కీలో దర్శనమిస్తుంది. పగ, ప్రతీకారాలతో మిళిత మవుతుంది.

ఝాన్సీ తండ్రి (శివకృష్ణ) సైన్యంలో అధికారిగా వుంటాడు. అతన్ను తన తోటి సైనికులను నలుగుర్ని చంపాడన్న నేరం మీద వాళ్ల పెద్ద సైనికాధికారి ఝాన్సీ తండ్రిని ఆమె ఎదుట చంపుతాడు. ఈ విషయం చెప్పేందుకు పోలీసు స్టేషనుకు పోయిన ఝాన్సీని అక్కడ మానభంగం చేస్తాడు సబ్ ఇన్స్‌పెక్టర్. అతడ్ని పిస్టల్‌తో కాల్చి చంపుతుంది. అక్కడి నుంచి ప్రారంభమైన ప్రతీకార చర్యతో విజృంభించి నానా రకాలుగా వీర విహారం సల్పి, చివరన తన తండ్రిని చంపిన సైనికాధికారిని హత మారుస్తుంది.

పనికి మాలిన ఈ పాత రకం కథను మరింత పనికి రాని తనంగా పనికి మాలిన దర్శకత్వంలో చిత్రీకరించ బడింది. దివాకర్ కెమెరా, కీరవాణి సంగీతం కొంత వరకు ఈ చిత్రం పరువు కాపాడాయి.

చావ బాదటం, తన్నటానికి అంకితమై పోయిన విజయ శాంతి నటనను గూర్చి చెప్పుకునే దేముంది. చరణ్‌రాజ్ పోలీస్ అధికారిగా చురుగ్గా వున్నాడు. కలెక్టరుగా వినోద్ కుమార్ చప్పగా వున్నాడు. బ్రహ్మానందం, ఆలీ సందు చేసుకొని కొంత హాస్యం అందించారు.

## చరిత్ర

4 పేజీ కొరవ

అవకాశం లేదు. కోటమిట్ట, ఫతేఖాన్‌పేట, మూలాపేట, ప్రభుత్వ అసుపత్రి వెనుక భాగాలలో క్రీ.శ. 6, 8 శతాబ్దాల నాటి మృణ్మయ పాత్రల శకలాలు కనుగొన బడ్డాయి. వీటి క్రింద ప్రాచీన చారిత్రక కాలం నాటి అవశేషాలు లభించవచ్చు. ఈ పట్టణంలో లభించిన మౌర్యుల కాలం నాటి వెండి విద్ధాంక నాణాలు, రోమన్ చక్రవర్తుల నాణాలు, ప్రాచీన చారిత్రక కాలం నాటి మృణ్మయ పాత్రల అవశేషాలు క్రీ.పూ. 3వ శతాబ్దంలో ఇక్కడ నివాసాలున్నట్లు, అప్పటి ప్రజలు విస్తతంగా వర్తక వాణిజ్యాలలో పాల్గొన్నట్లుగా ధృవీకరిస్తున్నాయి. దువ్వూరు, రామతీర్థం, గండవరం, కోటమిట్ట, కొత్త పట్నం గ్రామాలలో దొరికిన రోమన్ దేశస్తుల మట్టి పాత్రల శకలాలు విదేశీయులతో మనకు ఉన్న వాణిజ్య పరమైన సంబంధాన్ని తెలియ పరుస్తున్నాయి. అంతే గాక అప్పట్లో నెల్లూరు పట్టణం చుట్టూ ఉన్న గ్రామాలలో కోవూరు, జొన్నవాడ, గొలగమూడి, గుడిపల్లిపాడు, వావిలేటిపాడు మొదలగునవి పెద్ద గ్రామాలుగా గుర్తించ బడ్డాయి. ఈ గ్రామాల మధ్యనున్న నెల్లూరు తప్పని సరిగా ప్రాముఖ్యతను పొంది ఉండవచ్చు. పై అంశాలను దృష్టిలో పెట్టుకొని పరిశీలన జరిపినట్లయితే క్రీ.పూ. 3వ శతాబ్దం నుండి వేదాయపాళెం నుండి పెన్నానది వరకు అక్కడక్కడా పేటలుగా జన వాసాలున్నట్లుగా తెలుస్తుంది. అప్పటి నుండి మొదలైన వర్తక వాణిజ్యం క్రీ.శ. 5, 6 శతాబ్దాలలో అభివృద్ధి చెంది వర్తక సంఘాలైన నగరాలు ఏర్పడి నెల్లూరు పట్టణం నిర్దిష్టమయిన రూపాన్ని పొంది వుంటుందని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ బి. రాజేంద్ర ప్రసాద్ గారు అభిప్రాయ పడ్డారు.

నెల్లూరు పట్టణ ఉనికి గురించి పల్లవుల శాసనాల్లో మౌనంగా ఉన్నప్పటికీ పురావస్తు ఆధారాలు ఆకాలంలో నెల్లూరు అన్ని విధాలా అభివృద్ధి చెంది వుంటుందని తెలియ పరుస్తున్నాయి. అయితే మనకు రాజకీయంగా నెల్లూరుకు సంబంధించిన వివరాలు క్రీ.శ. 9వ శతాబ్దానికి ముందు నాటివి ఏమీ తెలియుటం లేదు. మనకు తెలియని అనేక సందేహాల నివృత్తికి పట్టణంలోని ఖాళీ స్థలాలలో పురావస్తు త్రవ్వకాలు జరప వలసి వున్నది. భూమి అడుగు పొరలలో నిక్షిప్తమై ప్రాచీన అవశేషాలు నెల్లూరు పట్టణ ప్రాచీనతను తెలియ చెప్పటానికి మరింత తోడ్పడ గలవు.

(మిగతా వచ్చేవారం)

## సినిమా

9 పేజీ కొరవ

వారి ఆగడాలను అరికట్టె నాధుడే లేడు" అన్నది నిజమే!

### అవార్డులు.... అవార్డులు

తిరుపతిలో 'సినిమా జెంటిల్‌మేన్ అవార్డులు' వరంగల్‌లో 'టాప్ - 10' అవార్డులు... ఇలా సినిమా వారికి అవార్డులు ఇవ్వడం కోసం మన రాష్ట్రంలో దాదాపు ప్రతి నగరంలోనూ పుట్ట గొడుగుల్లా సంస్థలు పుట్టుకొస్తున్నాయి. ఈ సంస్థలన్నీ సినిమా కళాకారులకు ఏవేవో అవార్డులిస్తూ, అసలు అవార్డులకే విలువ లేకుండా చేస్తున్నాయి. అవార్డుల విలువను కాపాడాల్సిన బాధ్యత సినీ ప్రముఖు లందరి మీద ఉంది. చూద్దాం ఎన్ని సంస్థల అవార్డులకు వీరు హాజరవుతారో!

### విశ్వనాథ్ దర్శకత్వంలో "శుభసంకల్పం"

కె. విశ్వనాథ్ దర్శకత్వం వహించే టైటిల్స్ "ఎస్" తో మొదలైతే శుభసూచకమని ఆయన నమ్మకం. ఈ మారు కూడా శ్రీ కోదండపాణి ఫిలిమ్ సర్క్యూట్ పతాకంలో ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం నిర్మించే చిత్రానికి "శుభసంకల్పం" అని పేరెట్టారు. ఈ చిత్రంలో కమలహాసన్‌తో పాటు విశ్వనాథ్, ఆమని, ప్రియా రామన్, గొల్లపూడి మారుతీ రావు, కోట, రాళ్లపల్లి, ఆలి, సాక్షి రంగారావు, ఎ.వి.ఎస్. సంజయ్, అస్రాని, శ్రీలక్ష్మి, వైష్ణవి పాత్రధారులు. సంగీతం: కీరవాణి.

### ఎ.ఆర్. రెహమాన్ పారితోషికం

"రోజా" చిత్రానికి సంగీత మిచ్చినందుకు నాకు పాతిక వేలిచ్చారు. ఇప్పుడు ఒక చిత్రానికి పాతిక లక్షలు తీసుకుంటున్నాను. శ్రమ అప్పుడూ ఇప్పుడూ ఒకటే. నేను నిదానంగానే బాణీలు కడ్తాను. అంత వరకు ఓపిక పట్టే వారి చిత్రాలకే సంగీత మిస్తాను. డబ్బు కన్నా సంగీతంలోని నాణ్యతనే నేను కోరుకుంటాను" అనే సంగీత దర్శకుడు ఎ.ఆర్. రెహమాన్‌కు త్వరలో వివాహం జరగబోతుంది. హీరో రఘు (రెహమాన్) భార్య చెల్లెలిని ఇతను మనువాడ బోతున్నాడు.

## 50 ఏళ్ల క్రితం

3 పేజీ కొరవ

యీ సంవత్సరం సాగలేదు. గ్రోమోర్‌ఫుడ్ ప్రచార ఫలితం కాబోలుఎ

* * *

డి.ఎస్.పి బ్రహ్మచారికాదు. వివాహమై 3 బిడ్డలుగూడా వున్నారు. పోలీసు శాఖ చురుగ్గా వున్నది.

* * *

"కేసరి" పత్రికాధిపతి పి.వి. సుబ్బారావుగారు హరిశ్చంద్రనాటకం ప్రదర్శిస్తామని టిక్కెట్లు అమ్మి మోసం చేశారన్న నేరానికి గజపతి నాయుడు గారి కోర్టులో 28తెది 1సంవత్సరం శిక్ష. రు.200లు జుల్మానా విధింప బడింది. జిల్లాకోర్టులో బెయిల్ కృషి జరుగుతున్నది.

## పంచాంగం

### ముహూర్తములు

8.3.95 తేది బుధవారం ఉదయం 10.32 గంటలకు వృషభ లగ్నమున వివాహ గృహారంభ ఉపనయన వ్యాపారములకు
రాత్రి 10.54 గంటలకు వృశ్చిక లగ్నమున వివాహ, గృహ ప్రవేశములకు సుముహూర్తము లున్నవి.

### మార్చి తిథులు

ఫాల్గుణ శుద్ధ

| | | | |
|---|---|---|---|
| తే 4 | శని | తదియ | సా.గ. 5.52 |
| తే 5 | ఆది | చతుర్థి | రా.గ. 7.05 వ |
| తే 6 | సోమ | పంచమి | రా.గ. 8.37 వ |
| తే 7 | మంగళ | షష్టి | రా.గ. 10.35 వ |
| తే 8 | బుధ | సప్తమి | రా.గ. 12.38 వ |
| తే 9 | గురు | అష్టమి | రా.గ. 2.47 వ |
| తే 10 | శుక్ర | నవమి | రా.గ. 4.45 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

ధర. 20 తేదీ సత్య హరిశ్చంద్ర నాటకాలు ప్రదర్శిస్తారు. ఈ నాటకాల్లో రామసుబ్బారెడ్డి, ఎ. రఘురామయ్య, ఎం. సీతాపతి, కె. సిద్ధేశ్వర రావు, ఎస్. శివరామ కుమార్, దేర్నాల హరిబాబు, బి. గురవయ్య, బి. బుజ్జి రెడ్డి, వి. సుబ్బారావు, వి. కోటేశ్వరి దేవి, చంద్రసేన, ప్రసన్న లక్ష్మి పాల్గొంటారు. పౌరాణిక నాటకాల నిర్వహణ ఖర్చుతో కూడుకొన్న పని. నాటకాలు వుచితంగా ప్రదర్శిస్తున్నందున వుదార స్వభావులైన కళాభిమానులు ఆదుకోవాలని నాట్య మండలి కోరుతుంది.

### అవోపా వార్షికోత్సవం

ఆర్యవైశ్య అఫిషియల్స్ అండ్ ప్రొఫెషనల్స్ అసోసియేషన్ 19 వార్షికోత్సవం వప్పుల వీధిలోని పాండు రంగ అన్నదాన సమాజంలో జరిగింది. క్రేన్ వక్కపొడి అధినేత గ్రంధి సుబ్బారావు ముఖ్య అతిథిగా విచ్చేసి మాట్లాడారు. మనిషికి ఓపిక, పట్టుదల అవసరమని దానికి గుర్తుగా కంపెనీకి కొంగ గుర్తును ట్రేడ్ మార్కుగా పెట్టుకొన్నట్లు చెప్పారాయన. నూతన కార్యవర్గం ప్రమాణ స్వీకార అనంతరం సుబ్బారావు చేతుల మీదుగా బీద వైశ్య విద్యార్థులకు, పేద వైశ్యులకు వస్త్రాలు పంచి పెట్టారు. అవోపా మహిళా విభాగం వారు వలిసీ అనంత రామ్ గుప్త చేతుల మీదుగా పేద వైశ్య స్త్రీలకు చీరలు ఇప్పించారు. సభలో అవోపా అధ్యక్షులు జి.ఆర్. కృష్ణమూర్తి అధ్యక్షత వహించారు. సభకు వైశ్య ప్రముఖులు కనమర్లపూడి తిరుమల రావు, వాకాటి తిరుపాల్, చీదెళ్ల వెంకటేశ్వర్లు, వొమ్మిన సుబ్రహ్మణ్యం, బోడా చిదంబరం తదితరులు పాల్గొన్నారు.

### మత్స్య సంఘాలకు ఇక స్పెషలాఫీసర్లు!

జిల్లాలోని 190 మత్స్య కారుల సహకార సంఘాలకు మేనేజింగ్ కమిటీ కాల పరిమితి పూర్తవడంతో తిరిగి ఎన్నికలు జరిగే వరకు స్పెషల్ ఆఫీసర్ల పాలన సాగుతుందని మత్స్య శాఖ సహాయ సంచాలకులు చెన్నారెడ్డి చెప్పారు. జిల్లాలోని వివాదాస్పద సంఘాలైన కువ్వం పల్లి, మల్లుగుంట, రాపూరు, కోదండ రామపురం, అనంత సాగరం, వింజమూరు, ఆత్మకూరు, కలువాయి, సింగపేట, జోరేపల్లి, అనికేపల్లి, కృష్ణాపట్నం, రాపూరు, వెంకన్న పాళెం, నేలటూరు, పట్టపు పాళెంలకు స్పెషల్ ఆఫీసర్‌గా మత్స్య శాఖ కో ఆపరేటివ్ ఇన్స్‌పెక్టర్ ఎన్. చిన వెంకయ్యను ప్రభుత్వం నియమించినట్లు వివరించారు. ఫిషరీస్ అసిస్టెంట్ డైరక్టర్ ఉత్తర్వు లేకుండా సంఘాల మాజీ కమిటీ సభ్యులు కొత్తగా చేర్చుకుని వుంటే అవి చెల్ల నేరవన్నారు. సంఘాల యొక్క బ్యాంకు ఖాతాలను స్పెషల్ ఆఫీసర్లే ఇక చూస్తారు.

### నెల్లూరు సౌత్ రోటరీ క్లబ్ దానం!

రోటరీ క్లబ్ ఇంటర్నేషనల్ 90 వ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని 'రోటరీ క్లబ్ నెల్లూరు సౌత్, మదర్ థెరిస్సా హోమ్‌లోని వారికి పండ్లు పంచారు. ఈ సందర్భంగా రోటేరియన్ కె. గోపాల రెడ్డి ఆరు వేల రూపాయలు విలువ చేసే వీల్ ఛైర్‌ను హోమ్‌కు బహూకరించారు. క్లబ్ ఉపాధ్యక్షులు శోభన్ ప్రకాష్ రిఫ్రిజిరేటర్‌ను దానం చేస్తానని వాగ్దానం చేసారు. హోమ్‌లో సిస్టర్ సూపిరియర్ ఆధ్వర్యంలో జరుగుతున్న నిస్వార్థ సేవను క్లబ్ అధ్యక్షులు బి. చిదంబరం ప్రస్తుతించారు. కార్యక్రమంలో బెజవాడ నరేష్ రెడ్డి, మల్లికార్జున రెడ్డి, దగ్గుపాటి శ్రీధర్ తదితురుల పాల్గొన్నారు.

### పొన్నాల రామసుబ్బారెడ్డికి అవార్డు!

తెలుగు పౌరాణిక నాటక రంగానికి విశిష్ట సేవ చేసినందుకు 94 సంవత్సరానికి జూలూరి వీరేశ లింగ కల్చరల్ అవార్డు నెల్లూరుకు చెందిన ప్రముఖ నటులు పొన్నాల రామసుబ్బారెడ్డికి లభించింది. నిర్వాహకులైన హైదరాబాద్ శ్రీ కళానికేతన్ సంస్థవారు అవార్డును ఫిబ్రవరి 6 తేది రవీంద్ర భారతిలో జరిగిన ఒక ప్రత్యేక కార్యక్రమంలో అవార్డు నందించారు. రాష్ట్ర ఉన్నత విద్యాశాఖా మంత్రి గాలి ముద్దు కృష్ణమ నాయుడు, పద్మవిభూషణ్ కాళోజి నారాయణరావు సమక్షంలో వేద పండితుల ఆశీర్వచనాల మధ్య 2,232 రూపాయలు నగదు బహుమతి పట్టు శాల్వ, బంగారు పతకం ఇచ్చి గౌరవించారు. అరుదైన అవార్డును పొందిన రామసుబ్బారెడ్డిగారు మరిన్ని అవార్డులు పొంది నెల్లూరు కీర్తి మరింత యినుమడింప జేస్తారని ఆశిద్దాం.

### టౌన్‌లో విద్యుత్ కోత మొదలయ్యింది!

గత ప్రభుత్వ హయాంలో విద్యుత్ కోతపై విరుచుక పడ్డ తెలుగు దేశం పార్టీ తాను అధికారంలోకి వచ్చిన రెండవ నెలలోనే విద్యుత్ కోత విధించేందుకు ఉత్తర్వులు జారీ చేసింది. ఈ మేరకు మార్చి 1తేది నుండి ప్రతిదినం మూడు గంటల పాటు అధికారిక విద్యుత్ కోత విధిస్తారు. ఉదయం 2 గంటలు. సాయంత్రం టౌన్‌లో కోత విధించే విద్యుత్ వుండదు. టౌన్‌లో ప్రాంతాల వారి వివరాలను డి.ఇ. రాధాకృష్ణారెడ్డి వివరించారు. అయ్యప్ప గుడి, వేదాయపాళెం, ట్రంకురోడ్డు, కాపువీధి, కోటమిట్ట, కామాటి వీధి, అల్లీపురం, మైపాడు రోడ్డు, నవలాకుల తోట ప్రాంతాల్లో ఉదయం 6గంటలనుంచి 8 గంటలవరకు విద్యుత్ సరఫరా వుండదు. పొదలకూరు రోడ్డు, జడ్పికాలనీ, పోస్టల్ కాలనీ, మూలాపేట, దర్గామిట్ట, ఫత్తేఖాన్‌పేట, బెక్కేమిట్ట, స్టోన్‌హౌస్‌పేట, లక్ష్మీపురం ప్రాంతాల్లో ఉదయం 7 నుంచి 9 వరకు విద్యుత్ వుండదు. భక్తవత్సల నగర్, కొండాయపాళెం, పాత హాస్పిటల్ రోడ్డు, రంగనాయకుల పేట, బాలాజీ నగర్, ఎసినగర్, రామ్మూర్తినగర్ ప్రాంతాల్లో ఉదయం 8నుంచి 10 వరకు కోత అమలులో వుంటుంది.

సాయంత్రం విధించే కోతల్లో పోలీస్ కాలనీ, జడ్పి కాలనీ, మూలపేట, ఫత్తేఖాన్‌పేట, బెక్కేమిట్ట, దర్గామిట్ట, అల్లీపురం ప్రాంతాల్లో సాయంత్రం 6 నుంచి 7 వరకు, ఇండస్ట్రియల్ ఎస్టేట్, వేదాయపాళెం, అయ్యప్ప గుడి, కోటమిట్ట, ట్రంకురోడ్డు, కాపువీధి, బాలాజీ నగర్, ఎ.సి.నగర్, రామ్మూర్తినగర్ ప్రాంతాల్లో 7 నుంచి 8 వరకు సరఫరా వుండదు. కొండాయపాళెం, భక్తవత్సల నగర్, పాత హాస్పిటల్ రోడ్డు, రంగనాయకుల పేట, స్టోన్‌హౌస్‌పేట, లక్ష్మీపురం ప్రాంతాల్లో సాయంత్రం 8 నుంచి 9 గంటల వరకు సరఫరా వుండదు.

### మున్సిపాలిటీ

12 పేజీ కొరవ

నెల్లూరులో ఎమ్మెల్యే రెడ్డి కాబట్టి, ఛైర్మన్ కమ్మ కివ్వడం న్యాయమన్న వాదం వైటి అభ్యర్థిత్వానికి ప్రచారం తెచ్చింది; మొన్నటి ఎన్నికలలో నిజాయితీగా పనిచేయడం 1983, 85, 89 ఎన్నికలలో టిక్కెట్ చేతి వరకు వచ్చి జారిపోవడం వంటి వన్నీ తడిపట్ల సానుభూతి పెంచాయి; చంద్రబాబు మనఃస్ఫూర్తిగా సహాయ పడ్డారు; సిఫార్సులు గట్టిగా పనిచేశాయి.

అన్నతో తనకున్న సాన్నిహిత్యం వల్ల తన మాటకు ఎదురు వుండదన్న అతి విశ్వాసంతో దెబ్బ తిన్నాడు రమేషెరెడ్డి. తన స్వంత బావను ప్రతిపాదించడం బలహీనతగా మారింది. పరిస్థితి గమనించి సర్దుకొని వుంటే బాగుండేది. కాని చివరి క్షణంలో పట్టుదలకు పోయి వైటి టిక్కెట్ రద్దు చేయాలని వత్తిడి తెచ్చి, నెల్లూరు నుంచి జనాన్ని రప్పించి, తానే వ్యతిరేకిస్తూ వచ్చిన పిటి రంగనరాజన్‌ను చివరి క్షణంలో ముందుకు నెట్టి పొరపాట్లు చేశారు రమేషెరెడ్డి.

టిక్కెట్ విషయంలో వైటితో అంత పంతానికి పోయిన ఎమ్మెల్యే ఇప్పుడు అదే వైటి గెలుపుకు మనఃస్ఫూర్తిగా కృషి చేయగలడా? రమేషెరెడ్డి వంటి తెలుగుదేశం విరాభిమాని పార్టీకి నష్టం కల్గించే ఏ చర్యకూ సిద్ధపడతాడని వూహించను కూడా లేము. కాని వారిద్దరి మధ్య పరస్పర సహకారం, సమన్వయత మాత్రం అసాధ్యం. కౌన్సిలర్ల టిక్కెట్ల విషయంలో ఇద్దరి ప్రవర్తనకు అనుగుణంగా వుంటబోతుంది తెలుగుదేశం ప్రచారం తీరు!


జమీన్‌రైతు
సంవత్సరచందా రూ. 100/-
అర్ధసంవత్సర చందా రూ.50/-
విడిప్రతిరూ. 2/-






## గ్రామపంచాయితీ కార్యాలయము

అల్లూరు, నెల్లూరు జిల్లా

ఆర్.ఓ.సి. నెం. 104/95 — 1.3.95 తేది

### టెండరు ప్రకటన

నెల్లూరు జిల్లా, అల్లూరు మండలం, అల్లూరు గ్రామ పంచాయితీ కార్య నిర్వహణాధికారి గారిచే గాని, వారి అధికారము పొందిన వారిచే గాని 21.3.95 తేది మంగళ వారము ఉదయం 10.30 గంటలకు యీ దిగువ అయిటములకు వేలములు, మరియు అదే రోజు మధ్యాహ్నము 3 గంటల నుండి 4 గంటలవరకు 1995 - 96 సం. సరఫరాలకు సీల్డు టెండర్లు స్వీకరించ బడును. 4 గంటల నుండి హాజరైన టెండరు దారుల సమక్షమున సీల్డు టెండర్లు తెరువబడును. వేలముల టెండర్ల వివరములకు గ్రామ పంచాయితీ కార్యాలయము పనిచేయు వేళల యందు అడిగి తెలుసుకొన వచ్చును.

### టెండర్లు - 1995 - 96 సం.నకు సరఫరాలు

| వరుస నెం | టెండరు | వివరములు | టెండరు ధరావత్తు |
|---|---|---|---|
| 1. | 1995 - 96 సం.నకు | దుగ్గబండికి ఎద్దు సరఫరా | రూ. 200/- |
| 2. | 1995 - 96 సం.నకు | పబ్లిక్ హెల్త్ సిబ్బంది దుస్తులు సరఫరా | రూ. 500/- |
| 3. | 1995 - 96 సం.నకు | పబ్లిక్ హెల్త్ సిబ్బందికి పాదరక్షలు సరఫరా | రూ. 100/- |
| 4. | 1995 - 96 సం.నకు | పబ్లిక్ హెల్త్ సిబ్బందికి సబ్బులు, కొబ్బరి నూనె సరఫరా చేయుట | రూ. 200/- |
| 5. | 1995 - 96 సం.నకు | స్టేషనరీ సామానులు సరఫరా చేయుట | రూ. 500/- |
| 6. | 1995 - 96 సం.నకు | పబ్లిక్ హెల్తు సామానులు సరఫరా చేయుట | రూ. 500/- |
| 7. | 1995 - 96 సం.నకు | PWS విడి భాగములు సరఫరా చేయుట | రూ. 500/- |
| 8. | 1995 - 96 సం.నకు | ట్రాక్టరు ...క్కు విడిభాగములు సరఫరా | రూ. 200/- |
| 9. | 1995 - 96 సం.నకు | రక్షిత మంచి నీటి సరఫరా పథకము ఎలక్ట్రికల్ మోటార్లు రివైండింగ్ మరియు రిపేర్లు చేయుట | రూ. 50/- |
| 10. | | ఆఫీసులో గల "S" టైపు కుర్చీలకు మరియు కొయ్య కుర్చీలకు ప్లాస్టిక్ అల్లించుట | రూ. 50/- |

### వేలములు

1. 1995 - 96 నుండి 1997 - 98 సం. వరకు మూడు సంవత్సరముల కాలమునకు అల్లూరు గ్రామ పంచాయితీ ఏరియాలోని గుంటలలో చేపలు పట్టుకొను హక్కు వేలము.
2. పాలసేకరణ కేంద్ర భవనము. బస్టాండు కాఫీ హోటలు భవనము మూడు (3) సంవత్సములకు వేలము.
3. బస్టాండు రుసుము వసూలు హక్కు. 1995 - 96 సం.నకు.
4. బండ్ల దొడ్డి రుసుము వసూలు చేసుకొను హక్కు. 1995 - 96 సం.నకు.
5. కూరగాయలు, చేపలు, మాంసము మార్కెట్టు యందు రుసుము వసూలు హక్కు, 1995 - 96 సం.నకు.
6. గ్రంథాలయములో పాత న్యూస్ పేపర్లు వేలము 1994 - 95 సం.నకు.
7. పనికిరాని పాత పబ్లిక్ హెల్త్ సామానులు మరియు వీధి విద్యుత్ దీపముల వేలము.
8. మార్కెట్టు కొట్లు 1 నుండి 24 వరకు 1 సం. కాలమునకు.
9. పేట బస్టాండు సోడా షాపు భవనము 1 సం.నకు వేలము.
10. కంపోస్టు వేలము. పిట్ నెం. 1 నుండి 18 వరకు

యం. రామయ్య, కార్యనిర్వహణాధికారి

అల్లూరు గ్రామపంచాయితీ, అల్లూరు

# మునిసిపాలిటీ

(మొదటి పేజీ కొరవ)

చెల్లిగవ్వ విలువ లభించలేదు. నిరాశ, నిస్పృహలు, అవమాన భారం ఆయనలో విచక్షణను పొగొట్టాయి. పిసిసి అధ్యక్షుడి పిఎ మాణిక్యాలరావు మాట్లాడుతున్నట్లు డిసిసి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవరెడ్డికి 1తేది ఉదయం ఒక టెలిఫోన్ వచ్చింది. " పివి ప్రసన్న రెడ్డి నామినేషన్ వేసివున్నారు కాబట్టి, ఆయనకే బి ఫారం ఇవ్వమని ఆ " మాణిక్యాలరావు" ఆదేశించాడట. సంజీవరెడ్డి గారు అదెట్లా కుదుర్తుంది. జనార్ధనరెడ్డి వంటి పెద్దలతో మాట్లాడాలి కదా అవి సమాధానం చెప్పాడట. తిరిగి మధ్యాహ్నం మళ్ళా అదే మాణిక్యాలరావు నుంచి మరొక ఫోన్ కాల్ వచ్చింది. మేము చెప్పేవరకు ఎవరికి బిఫారం ఇవ్వడానికి లేదని, జనార్ధన పూజారి ఆ ప్రకారం ఆదేశించారని చెప్పాడట. నెల్లూరు మునిసిపాలిటికి ఢిల్లీలోని పూజారికి సంబంధ మేమిటని సంజీవరెడ్డి రెట్టించడంతో టపీమని ఫోన్ పెట్టేశాడట. ఈ రభస తెలిసి జనార్ధనరెడ్డి గారు పిసిసి అధ్యక్షుడితో మాట్లాడి వివేకానంద రెడ్డి పేరిట ఎన్నిక కమీషనర్ బిఫారం ఇప్పించేశారు.

తీరా విచారిస్తే, ఈ టెలిఫోన్ కాల్స్, ఆదేశాలు వట్టి మాయ అని తేలింది. పివి రాజేశ్వరరావు వద్ద మాణిక్యాలరావు అనే పిఎ వున్నాడట. పిసిసి అధ్యక్షుడు శ్రీ కమాలుద్దీన్ అతడ్ని పిలిపించి నిన్ను నెల్లూరుకు ఎవరు ఫోన్ చేయమన్నారు. ఎందుకు చేశావు అవి

# అశ్రుతర్పణం

చిన్న వయసులోనే మాకు దూరమైన మా చిన్ని

జననం: 11.9.1966

మరణం: 29.2.1988

## పెనుబల్లి గిరిధర్

స్వర్గస్థులై 28.2.1995 తేదికి ఏడేండ్లు నిండుతాయి. వారి పవిత్రాత్మకు దైవ సన్నిధిలో చిరశాంతి కలగాలని ప్రార్థిస్తూ అశ్రుతర్పణం సమర్పిస్తున్నాము. నిన్ను మరువలేని

**పెనుబల్లి శ్రీనివాసులు - వసుంధర**

రిటైర్డ్ డిప్యూటీ కలెక్టర్ - రెవిన్యూ కాలనీ, నెల్లూరు

తల్లిదండ్రులు

**జితేంద్ర** - మాలిని
అన్న - వదిన

**సుమతి** - మల్లికార్జున
అక్క - బావ

**చక్రధర్ - విజయలక్ష్మి**
అన్న, వదిన

# అంత మక్కువ సాధించను ఎన్టీఆర్‌కు ఏమందుతిన్పించాడో వైటినాయుడు!

గర్తించే సరికి అతడు చిత్తరపోయి వాకేమీ తెలియదు మహాప్రభో అని మొత్తుకున్నాడట.

నిజానికతడు ఎవరికి ఏ ఫోనూ చేయలేదు. అతడి పేరుతో గొంతు మార్చి మాగుంట దాసుల వారే సంజీవరెడ్డిని దబాయించ చూశారని తేలినట్లు చెప్తున్నారు.

ఏదో ఒక మిషతో బిఫారం కమీషనర్‌కు చేరకుండా నిలువరించగల్గితే, ఢిల్లీలో సందిని పంది, పందిని నంది చేసైనా సరే పివి ప్రసన్నరెడ్డికి టిక్కెట్ తెచ్చుకోవచ్చునని మాగుంటవారు యత్నించినట్లున్నారు. కానీ మిమిక్రీ మోసం చేసి, మాయచేయబోవడం వారికే ఎదురు తిరిగి మాడు పగుల గొట్టింది. ఏదో గడబిడ జరుగుతున్నదనే సందేహంతో సంజీవరెడ్డి తొందరపడి బిఫారం కమీషనర్‌కు చేర్పించడంతో తదుపరి టిక్కెట్‌కు ప్రయత్నించే అవకాశమే లేకుండా పోయింది వారికి. నగర పాలిక చట్టం ప్రకారం బిఫారం ఇచ్చిన వారికే దాన్ని రద్దు చేసే అవకాశం; సంజీవరెడ్డి గొంతుకోసినా ఆ పని చేయడు. ఆయన తప్ప మరెవ్వరూ పిసిసి అధ్యక్షుడితో సహా దాన్ని రద్దు చేయలేరు. డామిట్ కథ అడ్డం తిరిగిందని మాగుంటవారు తెలుసుకునే సరికల్లా డామేజి

రెండు జిల్లాలలో పార్టీ విద్రోహానికి పాల్పడి, కాంగ్రెస్ అభ్యర్థుల ఓటమికి కారకుడైన మాగుంట సుబ్బరామరెడ్డి ఏ ముఖం పెట్టుకొని టిక్కెట్ కోసం నా దగ్గరకు రాగలడు" అని వ్యాఖ్యానించాడట ఒక మిత్రుని వద్ద!

గెలుస్తామన్న నమ్మకం లేని ఛైర్మన్ పదవికోసం తన స్థాయి, అంతస్తు మర్చిపోయి ఎందుకిన్ని అవమానాలు కొని తెచ్చుకుంటున్నారు సుబ్బరామరెడ్డిగారు? ఎందుకిన్ని మోసాలకు పాల్పడినారు? టిక్కెట్

అప్పుడు వివేకానంద రెడ్డి పరిస్థితేమిటి? టిక్కెట్ విషయంలో మాత్రం మురాకత్తిపోట్ల నుంచి జనార్ధన కవచం ఆయన్ను కాపాడింది. అదే డాలు ధరించి ఎన్నికల్లో తలపడ గలడా? మాగుంట వారు స్వతంత్రులుగానో లేక తెలుగు దేశంకు మద్దతుగానో నిర్ణయం తీసుకోవడం తప్ప తనకు సహాయ పడరని రుజువైతే ఎట్లా వ్యవహరించాలి? ఆఖరి ధామ్మిగా మరొకసారి వారి ఇంటికి వెళ్ళి తోడ్పాటు నభ్యర్థిస్తాడా? జికెరెడ్డి పరిసితేమిటి? మాగుంట వారితో విబేధించి వివేకాకు మద్దతిస్తాడా? లేక



# మానసికంగా గాయపడిన రమేష్ మనఃస్ఫూర్తిగా చేయూతనిస్తాడా?

జరిగిపోయింది. వివేకానందరెడ్డి గట్టున పడిపోయాడు. టిక్కెట్ తెచ్చి చూపిస్తానని శపథం చేసిన సుబ్బరామిరెడ్డి గారు - కోరి పరాభవం కొని తెచ్చుకోవడమే కాక, ఇంతటి రభస సృష్టించడం ద్వారా ప్రజలలో చులకన భావం కల్పించి కాంగ్రెస్ కొంపకు చేజేతులా నిప్పుపెట్టారు.

ఈ మధ్యలో టెలిగ్రాం మోసం ఒకటి జరిగింది. 1 తేది సాయంత్రం పిసిసి నుంచి టికెట్ ఎంపికకు పరిశీలకులు వస్తున్నారని పివి రాజేశ్వర రావు పేరుతో ఒక టెలిగ్రాం వచ్చింది.

అయితే అందులో ఎవరొచ్చేది తెల్పలేదు. 2తేది మధ్యాహ్నం తిరుపతి నుంచి రెడ్డి వారి రాజశేఖర రెడ్డి వచ్చారు. మీకు ఎవరి నుంచి సందేశం వస్తే నెల్లూరు వచ్చారని అడిగితే మాగుంట సుబ్బరామరెడ్డి గారి పిలుపు మీద వచ్చానన్నారట. పిసిసి నుంచి ఆయనకేమీ ఆహ్వానం లేదు. అంటే పిసిసి అధ్యక్షుడికి తెలియకుండా మాగుంట వారే పరిశీలకులను పిలిపించారన్న మాట.

పిసిసి అధ్యక్షుడు శ్రీ కమాలుద్దీన్ ఈ గడబిడ విని ఆగ్రహోదగ్రుడైనాడు. "రెండు నెలల క్రితం ఇదే వూర్లో అంత తేడాతో ఓడిపోయిన వ్యక్తికి మళ్లీ టిక్కెట్ అడగడానికి సిగ్గెట్లా లేకపోయింది;

రాకున్నా స్వతంత్రుడిగానైనా పోటీ చేస్తామని చెప్తున్నారట ఆయన. ఆ ఆలోచనతోనే ననుకుంటాము- 3తేది ఉదయం వరకు తమ వారిచేత నామినేషన్లు ఉపసంహ రింప జేయలేదు. అటువంటి పొరపాటు పనే చేస్తే - డిపాజిట్ కూడా తెచ్చుకోలేని దయనీయ స్థితిలో చరిత్రహీనులుగా మిగిలి పోతారు వారు. ఇప్పటికైనా తమ తప్పు తెలుసుకోగల్గితే తమ పరువు మిగిలినంత వరకైనా కాపాడు కోగల్గుతారు.

* * *

ఆనం, మాగుంటలను కలపడానికి శతథా ప్రయత్నించిన జికెరెడ్డి ఆ కృషిలో విఫలుడై నీరసపడి పోయారు. మంచి ఉద్దేశ్యంతో తాను చేయబోయిన ప్రయత్నాన్ని మాగుంట వారు అపార్థం చేసుకొని తననే అనుమానించడంతో డీలా పడి పోయారాయన.

జనార్ధనరెడ్డితో కలిసి పోవడానికి వచ్చిన అవకాశాన్ని వదులుకొని, ఛైర్మన్ పదవికి తన పేరు ప్రతిపాదిస్తారనే ఆశతో మాగుంటను కనిపెట్టుకొని వుండిన కెవి సుబ్బారెడ్డి గారిది మరీ విషాద పరిస్థితి. తమ దివాణంలో ఒక చిరుసేనానిగా తప్ప, పదవులకు గిదవులకు అనర్హుడనే ధోరణిలో వారు వ్యవహరించడంతో కుటుంబ సభ్యులూ వదలి పెట్టి వెళ్ళిపోవడంతో దిగులు పడిపోయి ఇంటికి పరిమితమై పోయారాయన.

వర్గ విధేయతతో స్నేహితుడికి దూరంగా జరుగుతాడా? కెవి సుబ్బారెడ్డి వైఖరి ఏమిటి? ఇంత జరిగాక కాంగ్రెస్ అభ్యర్థితో కలిసి రాగలడా?

ఎన్నో ప్రతికూల శక్తులు, అననుకూల వాతావరణంలో యుద్ధం చేయవలసి వుంటుంది వివేకానందరెడ్డి. కానీ ఈ పర్యాయం వివేక అదృష్టం బాగుంది! ఆ అదృష్టమే ఆయన్ను కాపాడాలి!

* * *

కాంగ్రెస్ ఏడుపులు అట్లావుంటే, తెలుగుదేశం మొత్తుకోళ్లు మరింత అధ్వాన్నంగా వున్నాయి. హైదరాబాదులో హోరాహోరీ యుద్ధం చేసి, అన్న వదినలను నొప్పించి, మెప్పించి టిక్కెట్ తెచ్చుకున్నాడు వైటి నాయుడు. అది అరివీర భయంకర పోరాటమే. ఎమ్మెల్యే శ్రీ టి. రమేష్‌రెడ్డి వైటి అభ్యర్థిత్వాన్ని మొదటి నుంచి వ్యతిరేకించాడు. ఎన్టీఆర్ తనమాట కాదనరన్న విశ్వాసం ఆయనలో వుండింది. కాని వైటి అక్కినేని నాగేశ్వరరావు, ప్రధాన కార్యదర్శి రాజాజీ వంటి వారిచేత సిఫార్సు చేయించుకొని చంద్రబాబు నాయుడు మద్దతుతో, అనుకున్నది సాధించాడు. ఎంత ప్రబలమైన మందు తిన్పించి వుండవిదే ఎన్టీఆర్ దగ్గర అంత మక్కువ సంపాదించి వుంటాడు చెప్పండి?

(శేషం 11 పేజీలో)

* * *

Edited, Printed and Published by N. Dolendra Prasad at ZaminRyot Press. OFFSET Printing at Nayagara Paper Products ( India ) Ltd.